# సృజన

112/113
ఫిబ్రవరి/మార్చి
1981

ఆధునిక సాహిత్య వేదిక
మాసపత్రిక





విరసం సభ్యుడు
అమరుడు
కామ్రేడ్ జ్ఞానేశ్వర్ కీర్తికి
విప్లవ జోహార్లు

ఈ సంచిక రు. 2

## కరీంనగర్, ఆదిలాబాద్ పోరాట పాటలు కావాలి !

ఆర్ ఎస్.యు. సభల నాటికి వెలుపరిద్దామనుకున్న కరీంనగర్, ఆదిలాబాద్ పోరాట పాటల సంకలనం అనివార్య కారణాలవల్ల సకాలంలో వెలువడలేక పోయింది. ఈ సంకలనం ఇంకా విస్తృతమైన సంకలనంగా మార్చి 15 నాటికి వెలువడుతుంది. మార్చి 1 లోగా అందేటట్లుగా మీ మీ ప్రాంతాల్లో ప్రచారంలో వున్న పాటలు పంపించండి. తెలుగు పాటలే గాక ఆదిలాబాద్ గిరిజన ప్రాంతాల్లో పాడు కుంటున్న గిరిజన భాషల పాటలన్నీ కూడా కావాలి. పాటలు పంపించవలసిన అడ్రసు : సృజన, హనుమకొండ, వరంగల్–506001.

---

## సృజన దగ్గర కొత్త పుస్తకాలు

సృజన ప్రచురణ :

1. మార్క్సిజం-లెనినిజం : మన సూక్ష్మదర్శినీ-మార్క్సిస్టుతత్వశాస్త్రం-ప్రధానాంశాలు— 0–50పై

క్రాంతి ప్రచురణ :

2. నాగేటి చాళ్ళల్లో రగిలిన రైతాంగ పోరాటం
   కరీంనగర్ ఆదిలాబాద్ రైతాంగ పోరాటాల సంక్షిప్త చరిత్ర రు.2–00
3. భారత దేశంలో జాతుల సమస్య-మార్క్సిస్టు దృక్పథం రు. 1–00
4. ప్రస్తుత రాజకీయ పరిస్థితి—మన కర్తవ్యాలు—సిపిఐ ఎంఎల్ (పీపుల్స్ వార్) రాజకీయ తీర్మానం 0–50పై

సొసైటీ ఫర్ సోషల్ చేంజ్ ప్రచురణ:

5. ప్రజాస్వామిక సంస్కృతి—కందుకూరి, గురజాడల దోహదం
   శ్రీశ్రీ, కుటుంబరావు, కె వి ఆర్,సి. ప్రసాద్, రామకృష్ణ రు. 3-50

రాడికల్ యువజన సంఘం ప్రచురణ :

6. జనం చిన్నాలు—చిన్నాలు సంస్మరణ రు. 1-00

మనీఆర్డర్ కూపన్‌మీద అడ్రస్, కావల్సిన పుస్తకాల పేర్లు విడి విడి అక్షరాలతో, తెలిసేట్టుగా రాయాలి. పుస్తకాలకు సరిపడే డబ్బు ముందే పంపాలి.

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

112/113 మాసపత్రిక ఫిబ్రవరి/మార్చి 1981


సంపాదకీయం 2

కవితలు : స్మృతి గీతం - కె. శివారెడ్డి 5

కళ్ళు - 'నిజం' 6

రక్తసిక్త జీవితం - ఎ. ఎన్. 9

విలువలు - శరత్ 54

కథ : పంచాది – పుప్పల నరసింహం 11

అనువాద కథ : 'ఎర్రసేన కుటీరం' – వై చిన్ యుంగ్ 26

వ్యాసం : రామప్పంతులు - పినాకపాణి 42

నవల - సీరియల్ : ఉప్పెన - చౌలి-షో 46

రిమైండర్ – అజ్ఞాత సూరీడు 55

కవిత్వం – శాస్త్రీయ విమర్శ – త్రిపురనేని మధుసూదన రావు 58

సాహిత్య లేఖ : భారత దేశ నైతిక విచారణ – వి. సుభద్రారావు 68



SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref. No. 182/A4/67. Dated 22-9-1967.

Edited, printed & published by P. Hemalatha for 'Sahithee Mithrulu'. Printed at Natyakala Press Hyderabad for Venkataramana Mudranalayam, Warangal.

Working Editor ; Varavara Rao.

## జ్ఞాని—'జానీ'

విరసం సభ్యుడు కామ్రేడ్ జ్ఞానేశ్వర్ హత్య జరిగి ఏడాది గడచిపోయింది. కాని ఇంకా విచారణ ప్రారంభమేకాలేదు. ఎందువల్ల ? నిందితుడు దొరకలేదా ? కాదు. సాక్షాలు లేవా? స్వయంగా హతుని మరణవాఙ్మూలంతోపాటు తమ కళ్ళతో ఈ హత్యను చూసిన సాక్షులున్నారు. నిందితుడూ అరెస్టయ్యాడు. విడుదల అయ్యాడు. సహజంగా పెద్దమనిషిలా చలామణి అవుతున్నాడు. అంతేకాదు సాక్షులను బెదరిస్తున్నాడు. వరంగల్ జిల్లాలో ఇందిరా కాంగ్రెస్ హంతకరాజకీయాలకు అండగా నిలిచి "జాని"ని చంపిన తన నేరాన్ని కప్పుకోగలగడమే కాదు సాక్షులను బెదరించే కార్యక్రమానికి అధికార వర్గాల బలాన్ని కూడ తెచ్చుకోగలుగుతున్నాడు. చట్ట ప్రకారం ఇది ప్రాసిక్యూషన్ కేసు. నిందితుడు సాక్షులను బెదరించకుండా విచారణ శీఘ్రంగా జరిగేట్లు చూడాల్సిన బాధ్యత ప్రాసిక్యూషన్‌ది. నిందితుడు, సాక్షులు, ప్రాసిక్యూషన్ అందరూ అందుబాటులో వుండి, హతుని మరణవాఙ్మూలం కూడ వుండి ఎందువల్ల ఈ విచారణ ఆలస్యమవుతున్నట్లు? ఏ అదృశ్య 'హస్తం' ఈ ఆలస్యానికి కారణం. మరి కోర్టులనిండా కేసులు నిండిపోయి ఆలస్యమవుతున్నదా ? అయిదునెలల్లో రెండు మూడు హత్యకేసులు, పదిపన్నెండు దోపిడీ దొమ్మీ కేసులు విచారణ జరిగి తీర్పు వస్తుంది. అక్కడ సాక్షాలు వుండవు. నేరస్తుడు నిర్దోషిగా నిరూపితుడవుతాడు. ఇక్కడ సాక్షాలు వున్నాయికదా. నేరం నిరూపణ అవుతుందికదా అందుకని ఇది విచారణ జరగదు. ఇట్లా అనుమానించడానికి ఆస్కారం వుందాలేదా ?

నేరం చరిత్ర రచిస్తుంది. నేరం సాహిత్య పోషణ చేస్తుంది. నేరం ఈ విద్యా విధానాన్ని పోషిస్తుంది. నేరం రాజ వీధుల్లో వాహనాల్లో ఊరేగుతుంది. నేరం మంత్రులతో మంతనాలు జరుపుతుంది. నేరం పొట్టకూటికి తన దగ్గర సర్టిఫికెట్లు తాకట్టుపెట్టిన విద్యావంతులకు వేతనాలు కాదు కదా కూలీ కూడ ఇవ్వదు. ఇదేమి న్యాయమంటే తొలగిస్తుంది. అధికారులను కాని అధ్యాపకుల మొరలను అరణ్య రోదన చేస్తుంది. నేరం ఆడవాళ్ళను చెరస్తుంది. చెరచెప్పుకోలేని అసహాయ వాణిని నొక్కేయ గలుగుతుంది. నేరం కోర్టులోని న్యాయదేవత కళ్ళు మూస్తుంది. నేరం నగరం నడిబొడ్డున నియోన్ లైట్ల వెలుగులో కాలిపోయిన జ్ఞానేశ్వర్ శవంలా ప్రజలకు స్వచ్ఛంగా కనిపిస్తూనే వుంటుంది. కానిస్వేచ్ఛగా తిరుగుతుంటుంది. ఎందువల్ల ? ఇది దోపిడీ కొండ. ఈ కొండను తవ్వడానికి ప్రయత్నించిన వయసు 'మూర్ఖుడు' జ్ఞానేశ్వర్. కమ్యూనిస్టులే కవిత్వం రాస్తారంటే ఒప్పుకోని బూర్జువా సమాజంలో కత్తెర తీసుకొని బట్టలనే కాదు ఈ సమాజాన్ని కూడ ఆపరేషన్ చేయడానికి ఈ వృత్తి జీవి వ్యావృత్తి తపన చెందిందంటే కష్ట జీవులు తప్ప ఎవరు నమ్మగలరు ?

అతడు కామ్రేడ్ జార్జ్‌మీదనో, పొలంలో పనిచేసే పాలేరుమీదనో, ట్యుటోరియల్‌లో పనిచేసే అసహాయ అక్క చెల్లెళ్ళ మీదనో, అట్టడుగు ప్రజల కోసం ప్రాణాలర్పించిన చిన్నాలు మీదనో, పాలడుగు కృష్ణమీదనో కవిత్వం రాసాడు గాని, జార్జ్‌చక్రవర్తి మీద, పొలం కామందుమీద ట్యుటోరియల్ విద్యా పోషకునిమీద, ఇందిరాగాంధీమీద, ఈహంతక వ్యవస్థమీద పొగడుతూ పద్యాలు రాయలేదు. పోనీ, లెంపలేసి యువకుడు గనుక ప్రేమ కవిత్వమో, ప్రభుత్వ కటాక్షం కోసం కుటుంబ సంక్షేమ కవిత్వమో రాయలేదు. మరి ఈ రోజుల్లో విప్లవ సాహిత్య 'విమర్శకులైన' పోలీసులకు ప్రాసిక్యూటింగ్ మన స్తత్వంతోనే ఆలోచించే బూర్జువా మేధావులకు ఆయన కవి ఎట్లా అవుతాడు ? కవులను చంపే గుండాలు పెద్దమనుషులుగా, 'పెద్దమనుషుల' గుండా యిజాన్ని బట్టబయలు చేసే కవులు 'గుండాలు'గా గుర్తింపబడి ప్రచారం చేయబడుతున్న వ్యవస్థ ఇది.

ఈ పరిస్థితుల్లో ముఖ్యమంత్రి అంజయ్యగారు వరంగల్ జిల్లాలో ఎవరి దౌర్జన్యాలు అరికట్టటానికి రెండువారాల అల్టిమేటమ్ ఇచ్చినట్టు? నర్సంపేట తాలూకాలో పోలీసు క్యాంపులు పెట్టుకొని వాటి అండతో ఇందిరాకాంగ్రెస్ కొనసాగిస్తున్న దౌర్జన్యాన్ని అరికట్టడానికి ఆయనకు దమ్ములున్నాయా? నిజంగా ఉన్నతస్థాయి న్యాయవిచారణ జరిపి మార్క్సిస్టుపార్టీ నెత్తిన నోరు పెట్టుకుని అరుస్తున్న ఇందిరా కాంగ్రెస్—నక్సలైటు పొత్తులోని నిజానిజాలను బయటపెట్టే నిజాయితీవుందా? ఇదే లేనపుడు చిన్నాలు, కృష్ణ, జ్ఞానేశ్వర్‌ల హత్యల విచారణ న్యాయంగా, శీఘ్రంగా జరుగుతుందన్న హామీ వుంటుందా? కనుక దౌర్జన్యాలను అణచే హెచ్చరిక మాటున ముఖ్యమంత్రి దౌర్జన్యాలకు అభయహస్తమిస్తున్నాడు. దౌర్జన్యాలను అణచే పేరుతో రాజకీయ ప్రత్యర్థులను అణచడానికి చూస్తున్నాడు. పోలీసు క్యాంపులను స్థిరం చేయడమేకాదు, పోలీసులు ఇప్పటికే గ్రామాలమీద పడి దోచుకుంటున్నా దోపిడీని చట్టబద్ధం చేయదల్చుకుంటున్నాడు. రాజకీయ ప్రత్యర్థులను జైళ్ళలో తోయడానికి జాతీయ భద్రతాచట్టం కోరలు తోముతున్నాడు. వరంగల్ జిల్లాలోపాలక వర్గాల హింసా రాజకీయాల్లో పావులుగాకుండా ప్రజలను చైతన్యవంతుల్ని చేసి నూతన ప్రజా స్వామిక విప్లవంలోకి నడిపించే ప్రజా కార్యకర్తల కాళ్ళూ చేతులూ నోళ్ళూ కట్టెయ్యాలని చూస్తున్నాడు.

ఈ నేపథ్యంలోకానీ జ్ఞానేశ్వర్ హత్యానేరవిచారణ ఎందుకు ఆలస్యమవుతుందో అవగాహన చేసుకోలేం.

అయితే ఏడాదిగా జ్ఞానేశ్వర్ హత్యా నేరవిచారణ మరొక చోటకాదు పలు చోట్ల జరుగుతూనే వున్నది. ప్రజలనోళ్ళల్లో, మెదళ్ళలో స్పందనలో జరుగుతూనే వున్నది. రూపు దిద్దుకుంటున్న ప్రజా చైతన్యంలో జరుగుతూనేవున్నది. కదలకుండా చెదరకుండా వున్నట్లు అనిపిస్తున్న దోపిడీకొండ పాదు కదులుతూనే వున్నది. ఒక్కొక్క పెల్లగా కొండ రాలిపోయి జ్ఞాని మూర్ఖుడు కాదు జ్ఞాని అని రుజువవు తూనే వున్నది. ఇది ఏడాదికింద ప్రారంభమయిందికూడాకాదు. ఈ పని ప్రారంభిం చిన వాళ్ళలో జ్ఞానేశ్వర్ మొదటివాడూకాదు చివరివాడూకాదు. ఈ దోపిడీ కొండల్ని కూల్చే బృహత్తర కార్యక్రమంలో వేయబడిన రక్తసిక్తమైన బాటలో 'వెలుగు మంటలు' మండుతూ జానీ జీవిస్తూనే వుంటాడు.

**వరవరరావు**

11-2-81

"నేను రచయితను, విప్లవ రచయితల సంఘంలో సభ్యుడను. సమాజంలో అన్యాయాలను, అక్రమాలను, దోపిడీ, దౌర్జన్యాలను ప్రజలకు సవివరంగా తెలియ జెపుతూ కవితలు, కథలు, నాటికలు, నాటకాలు నవలలు రాస్తాను. వీలైనంత మేరకు ప్రతిఘటిస్తాము. అలాగే నేను- కొండయ్య యొక్క శరత్ ప్రభుత్వ మోదిత ఉన్నత పాఠశాల బోర్డు వెనక జరుగుతున్న అన్యాయాలను, అక్రమాలను దోపిడీ, దౌర్జన్యాలను ఎప్పటికప్పుడు మా వాడలోని ప్రజలకు వివరిస్తూ, ప్రతిఘటిస్తూ వస్తున్నాను. అతడు సాగిస్తున్న వ్యాపారానికి నేను అడ్డంకిగా వున్నాను. అందుకే లతడు నన్ను శాశ్వతంగా నిర్మూలించాలనుకున్నాడు. ఆ ప్రయత్నంలో భాగం గానే నేను నిద్రిస్తున్న సమయం చూసి, పెట్రోల్, గ్యాస్ నూనె పోసి నిప్పంటిం చారు, కొండయ్య, దామోదర్ కలిసి"

(జ్ఞానేశ్వర్ కీర్తి చనిపోయే ముందు యిచ్చిన మరణ వాఙ్మూలం)

# స్మృతి గీతం

**కె. శివారెడ్డి**

(చెట్టుకు కట్టి కాల్చేయబడ్డ నగ్జలైట్ల స్మృతిలో)

నా నుదురొక క్వారీ
కళ్ళు పరిపూర్ణ జలాశయాలు
సంపూర్ణ జనాశయాలు.
తొంగిచూస్తే
సువ్వూ కనబడతావు
కుక్కా పిల్లా కనబడుతుంది.
పైన పచ్చని ఆకాశమూ ప్రతిఫలిస్తుంది.

నా నుదుటి మీద చేతులు పుష్పిస్తున్నాయి
సూర్యుడు ఎర్ర పావురమై విహరిస్తున్నాడు
శిలాఫలకాల పేజీలు తిప్పితే తెలుస్తుంది
జీవితమంటే బద్దలుకొట్టటమనీ — పోరాడటమనీ —

రాళ్ళు జీవితం వాసన వేస్తున్నాయి
నీళ్ళు బతుకు వాసన వేస్తున్నాయి
భూమి భూమంతా మనిషి వాసన వేస్తుంది

బద్దలు కొట్టి నిర్మించటంలోనే పునః సృష్టి లోంచే
కొత్తగాలులూ కొత్తయుగాలూ కొత్త కళ్ళూ ఆవిర్భవిస్తాయి—
నేను మనిషిని పిలుస్తున్నాను-అతని
నిత్యహరిత వాంఛా అరణ్యాల్ని — సముద్ర దుఃఖాల్ని
ఆకాశనేత్రాంచలాల్ని అనంత సంగ్రామాల్ని పిలుస్తున్నాను
మానవుడి చేతులు నన్ను బంధిస్తాయి
నాగలి చేసి భూమిని దున్నేస్తాయి
విత్తుని చేసి భూమిలో నాటేస్తాయి
భూమి గర్భంలో సురక్షితంగా పెరిగి భూమిపై కొచ్చినప్పుడు
మానవుల దేహాలు నన్ను సంలీనం చేసుకుంటాయి
వధించండి! వధించండి బతికించండి
ఖండించండి! ఖండించి నిర్మించండి
కాలం నా రక్తం వానై కురుస్తా
మీ యింటి ముందున్న చెట్ల కళ్ళతోనో వేళ్ళతోనో స్వీకరించండి

అరుగుమీద కూర్చున్న అతిథి ఎవరు? నేనే
మీ చర్మంకింద నులివెచ్చగా జన్మిస్తున్న ప్రభాతమూ నేనే
మీ వేళ్ళ చివరల దూరదర్శినీ కేంద్రాలూ నేనే
రాత్రి అంచుపొర్ల జారుతున్న వెలుగునీరమూ నేనే

గుడ్డలు పిండుతున్న శబ్దంగానీ వడ్లు దంచుతున్న శబ్దంగానీ
పాలు పితుకుతున్న శబ్దంగానీ పారదమ్మ్మ చేస్తున్న శబ్దంగానీ
బండీలాగుతున్న శబ్దంగానీ బండలు పగులుతున్న శబ్దంగానీ
పై కెక్కుతున్న పాదాల శబ్దంగానీ ఆకులల్లాడుతున్న శబ్దంగానీ
కొమ్మల్లో నిప్పు మొలుస్తున్న శబ్దంగానీ
గుడ్డులో పిల్ల కదలాడుతున్న శబ్దంగానీ నేనే నేనే

శబ్దాల జఠరాగ్ని నేనే
శబ్దాల క్రియాత్మకత నేనే
శతాబ్దాల శబ్దసంపద నేనే
నా హృదయమే కాదు
నా మనస్సే కాదు
నా శరీరమంతా ఎర్రని గాయమై పుష్పిస్తుంది
రక్త పరిమళాల్ని వెదజల్లుతోంది.

## కళ్ళు

### 'నిజం'

దోసిళ్ళ నిండా కళ్ళు, కుంచాల నిండాకళ్ళు, గంపల నిండా కళ్ళు, గోనెలనిండా, బానల నిండా కళ్ళు, లారీల నిండా కళ్ళు, బోగీల నిండాకళ్ళు, రేవులనిండా, విమానాశ్రయాల నిండా విగతాశలు కళ్ళు నిరీక్షణలు కళ్ళు.

కళ్ళు, చూపుల ప్రాణాలు పొదిగిన చర్మపు దోనెలు
చర్మపు పత్రాలు తొడిగిన చైతన్య పుష్పాలు
గుండెల సముద్రాల్లోని బాధల బడబాగ్నుల్ని తోడి
బొట్లు బొట్లుగా రాల్చే అనుభవాల ఏతాలు కళ్ళు.

కళ్ళు, కలల తోటలు, కల్పనా శిల్పాలు, ఆలోచనల విలుకాడు
సంధించిన అవగాహనల బాణాలు, మేధో విద్యుత్తులు

వెలిగించిన మెర్క్యూరీ బల్బులు, చలించే, జ్వలించే
కలతల పర్వతాలు కళ్ళు

కళ్లు, పాటల బంధువులు, చీకటి
వలయాల్ని ఛేదించే కరెంటు కత్తెర్లు, రగిలే హృదయాల
రాసుల్లోనుంచి పైకెగసిపడి, పర్గకసి ఈ యుగ
స్వభావమని చాటుతున్న జ్వలితాగ్ని గోళాలు కళ్ళు.

పెట్టుబడుల కబేళాల్లో, స్వంతాస్తుల మృత్యుగుహల్లో
నిముషానికొక చావుకేక, లిప్తకొక శ్రమసమిధ ఆహుతి,
ఈ వ్యవస్థ గానుగ పళ్ళ మధ్య నొక్కివేయబడుతూ
రక్తస్వేదాల స్రవంతిని లాభాల కర్మాగారానికి
ముడి సరకుగా అర్పిస్తూ కలతలనూ కన్నీళ్ళనూ
జాతీయ సంపదగా పంచుకుంటున్న
జీవన సజీవచిత్రాలను నిక్షిప్తం చేసుకున్న
నగ్న జీవన నిధులు కళ్ళు.

కళ్ళు రైలింజన్లలో నిరంతరం మండే ఆలోచనల బొగ్గు,
కళ్ళరైళ్ళల్లో అసంఖ్యాక ప్రయాణీకులు
రెప్పపాటు కాలంలో ఎక్కుతారు, దిగుతారు
కొందరు శాశ్వత ముద్రలు. పయనించే మనిషి
నావకు దిక్సూచి కళ్ళు.

కళ్ళ ఇళ్ళల్లో వర్తమాన సామాజిక చేదువాస్తవాల కాపురాలు,
భవితవ్య పథనిర్దేశక దర్శకులు కళ్ళు

కళ్ళ నునులేత గగనాల్లోంచి ఎన్నెన్ని సూర్యోదయాలు
కళ్ళ చిరుచిన్న సృష్టిగోళాల్లోంచి ఎన్నెన్ని కొత్త దృక్పథాలు

కళ్ళు కళ్ళు కళ్ళు కళ్ళు, 66 కోట్ల జతల కళ్ళు
దోసిళ్ళనిండా కళ్ళు, గోనెలనిండా బాసలనిండా కళ్ళు
లారీలనిండా కళ్ళు, బోగీలనిండా కళ్ళు
రేవులనిండా విమానాశ్రయాల నిండా ఆక్రోషాలుగా కళ్ళు ఆశలుగా కళ్ళు
పల్లెలనుంచి పట్టణాలకు, పట్టణాలనుంచి నగరాలకు
నగరాలనుంచి విమానాశ్రయాలకు, నౌకాశ్రయాలకు
ఎడ్ల బళ్ళల్లో, మోటారు వాహనాల్లో, రైళ్ళల్లో

విమానాల్లో రవాణా అవుతున్నాయి కళ్ళు.
ఎక్కడికీ నయన ఝరి ? ఏ గమ్యానికీ నేత్ర ప్రవాహం ?

పాలకుల స్వార్థాలు ఫలించే
అన్యాయ అక్రమాల మాగాణుల్లోకి, ధనస్వాముల పెట్టుబడులకు
విపరీత లాభాలు రాల్చే శ్రమ దోపిడి కసాయిశాలల్లోనికి
ఈ జాతిని మరింత పకడ్బందీగా, అటూ ఇటూ
బెసక్కుండా తీసుకువెళ్ళే నిఖార్సయిన చూపును
ఈ కళ్ళకు అతికించే విఫల ప్రయత్నాలు

ఈ చూపుల మూపులపై పత్రికల అబద్ధపు
ప్రచారాల, సెక్స్ క్రైమ్ చలన చిత్రాల టన్నులకొద్దీ బరువులు
ఈ చూపుల మెడలకు
పాశ్చాత్య సంస్కృతీ నాగరికతల గుదిబండలు
ఈ చూపుల కాళ్ళకూ చేతులకూ వెట్టిచాకిరి జీవనశైలీ సంకెళ్ళు
అయినా లాభం లేకపోతోంది.
ఒక్కడి సుఖం కోసం వందమంది శ్రమను
సునాయాసంగా, కళాత్మకంగా దోచి ఇచ్చే
లెజిస్లేచర్ల, శాసనాల, న్యాయస్థానాల, రాజ్యాంగ నిబంధనల
నున్ననైన పాకుడు మెట్లతో
నిర్మించిన ఈ సుందర భవంతిని కూలదోయడానికి
ఈ చూపులు "కుట్ర" పన్నుతున్నాయి

ఈ చూపులు ఎర్రగా, ఆ చూపుల కేకలు
ఇంకా ఎర్రగా, ఆ కేకల ప్రతిధ్వనులు ఎర్రెర్రగా,
వాటివెంట లేస్తున్న కోట్లాది చేతుల ఖడ్గాలు మరీ
ఎర్రగా రాజు కుంటున్నాయి.

అందుకే — ఈ కళ్ళను తక్షణం మరమ్మతు చేయాలని
వాటికి "కొత్త" చూపుల్ని అతకాలని
ఈ జాతిని మళ్ళీ తమ దారిలోకి తీసుకోవాలని
అందు కోసమే ఈ నేత్ర హింస.

# రక్త సిక్త జీవితం

ఎ. ఎస్.

కలుగుల్లో దూరిన ఎలుకల్లా
గప్‌చుప్...
నిస్తబ్ధత తెలుసునాకు—
సంసార పక్షంగా దేనికీ కాకుండా—
బతకడం నేర్వలేదు నేను...
దుప్పటి ముసుగులోంచి
జీవిత ప్రేరేపిత లక్ష్యాలగురించి
ఎడ తెరిపిలేని ఆలోచనల—
పొగమంచు—చూరి—చూరి...
గుండె లబ్‌డబ్—గరుకు గరుగ్గా—
గడియారం ముల్లు—ఎంతకు తిరగని చక్రం
అసహాయత తెలుసునాకు...
కాలం ఖర్చయితే దొరకదన్నంత ప్రీతి పాత్రంగా
ముల్లు నంటిపెట్టుకొని బతికే ఉత్తేజాన్ని నేను.
ఊపిర్లు ఉమ్ముతున్న బరువైన నిక్షేపం లోంచి
దీనులు దుఃఖించడం తెల్సునాకు
కన్నీళ్ళు పెళ్ళుబుకడం—
కన్నీళ్ళు వర్షించడం—
తెలుసునాకు-
కన్నీళ్ళు తుడవడం
నేర్చుకునేవాన్ని నేను.
మూడు రెక్కల పంఖాకింద—
రంగులేసిన గది వాసనలో—
రెండు రెక్కల అసంతృప్తి ఊపిరి—
'బతుకు తాకిడికి బలియైన'
బుక్కెడు కూడుకోసం పసిపాపలు
సంవత్సరాల తరబడి గుక్కపట్టి ఏడ్వడం—
కడుపు అవిసిపోగా వింటూ నేను-
ఉడకేసిన గుడ్డులోంచి వెలికితియ్యలేని మృత శిశువును కాదు-
సహనం చచ్చి—

పురిటినొప్పులుపడే ఉచ్ఛ్వాసాల వేగంమీద
జీవించడం తెల్సునాకు...

* * *

రంగుల మయమైన నిశ్శబ్దం-
ఉడుకు ఆవిర్లు ఎగజిమ్మే ఉత్తేజం
మా అమ్మ అడివి గుర్తుందినాకు-
పల్లెలు—పల్లెల్లో ఊపిర్లూదిన వాళ్ళు
సీదా సాదా నా నెత్తురు నేస్తాలు గుర్తున్నారునాకు-
చెట్లు మాట్లాడలేవు-అరవలేవు
వేలాడదీసిన మనిషి ఉడుకు నెత్తురుకు—
స్పందించి—అసహనంగా ఆకుల కొడవళ్ళూపడం-
పారిన పొర్లిన నెత్తురు గరక శ్వాసించడం
నాకు బాగా తెలు...

* * *

మానవునిగా నా ఉనికి గురించి
నేనే నిర్ణయించగలను—
"దుఃఖంలో అధోజగత్ సహోదరులు చింతిస్తున్నారు"
గుడ్డు పగులగొట్టుకుని,
బయటకొచ్చే పిల్ల జన్మను అంగీకరిస్తాన్నేను.
ఉత్తేజాన్ని, ఉప్పెనను,
మార్పును, మార్పుచేయగల శక్తిని
మానవుని ఉనికిని అంగీకరిస్తాన్నేను.
జీవితం రక్తసిక్తమై వికసించడం
నేను ప్రేమిస్తాను...

* * *

# 'పంచాది"

పువ్వుల నరసింహం

గది పంచాతాఫీసు - దాని పక్కకు 'పీర్లకొట్ట' ముంది — 'పీర్లకొట్టం'లపీర్లున్నయ్ —పంచాదాఫీసుల మనుషులుండ్రు. పీర్లకు రంగు రంగుల 'దట్టి' లున్నయ్. పీర్లనెత్తిమీద దగ దగ మెరిశె 'పంజ' వుంది — గా మనుషుల నెత్తిమీదనెమో నున్నగ యెంటికలున్నయ్ నల్లగ — జెర్రిపోతు సార్కలున్నట్టుగ.

పీర్ల మెడలో యెండిపోయిన పువ్వులున్నయ్ — గవి నల్లగయినయి. గక్కడ కూసున్న ఒకరిద్దరి పెద్దమనుషుల మెడలళ్ళగూడ రుద్రాచ్చమాలలున్నయ్ - గవి గూడ నల్లగనే వున్నయ్, నశం రంగుల—యిగ పీర్లకు కాళ్ళు, శేతులు నరికేశినట్టు మొండి గున్నయ్. రెండు కాళ్ళు పోయ్న కుంటోడు గద్దెమీద గూసున్నట్టున్నయ్ గాపీర్లు — గని గా మనుషులకైతే కాళ్ళు, శేతులు దొడ్డుగ బందబస్తుగున్నయ్ — గంతేగాక పీర్లకు పాణంలేదు — గక్కడున్న మనుషులకైతే పాణమున్నది, దమాకున్నది — ఎల్లిని మల్లి, మల్లిని ఎల్లిజేస్తరు — కిందపెడ్తె మీదపెడ్తర్, మీదపెడ్తె కిందపెడ్తర్—కిందబడ్డా, మీదబడ్డా 'బంచోత్' అంటర్ ఆళ్ళు-

గా మనుషులు ఊరికి ఒక మూలగున్న గా పంచాదాఫీసు చిడీళ్ళ మీద కూసోని సుట్టలు, శిగిలేట్లు పీల్సుతుండ్రు — నల్లగ దొడ్డుకు దొడ్డున్న పెద్ద మనిషాకాయన బంగారి రంగు కండ్లద్దాలు కిందికి మీదికి అనుకుంట, కండ్లు మిటకరిస్తూ కాయిదాలు సదువుతుండు — గాయన పేరే యెంకట్రామిరెడ్డి పటేల్. గాయనే ఊరికి పెద్ద — పంచాదులను, కొట్లాటలను ఊరుదాటి పోనియ్యకుంట తశ్వజేస్తడు— ఊరును 'కదర్' మీద ఉంచాలని శానశాన జేస్తడు—

ఊర్లె పెద్దమనుషులంత గాయన మాటింటరు — ముసలోళ్ళు ఎన్కటి కాలమోళ్ళు ఆయ్నకు వొంగొంగి దండాలు పెట్టి మర్యాదిస్తరు — సేట్లు, సావుకార్లు, కాపులు, ఆసాములు, అప్పులిచ్చేటోళ్ళు ఆయ్న ఎట్ల జెప్తె గట్లనడుస్తరు — గాయన మాటకు ఎదుర్ లేదు — ఎవడు పల్లెత్తి జవాబియ్యడు ఆయ్న ముంగల — గిట్లజేశే ఊర్ని శాన ఖబడ్దార్‌ల వుంచుకుండు —

గా వూర్లెనే గాక ఆ సుట్టుపట్ల ఊర్లళ్ళ గూడ పేరెల్లినోడు యెంకట్రామిరెడ్డి పటేలు — పంచాదులు, కొట్లాటలు తెంపనీకి శాన దూరం, దూరం బోయొస్తడు — గా పటేల్ అంటే శాన మందికి అదర్ — ఆయ్నను జూస్తెనే అంత దూరంకెల్లి మర్లి పోతరు — శెప్పులు శేతుల పట్టుకుని ఒక్కొక్కరు వేరే తొవ్వెంట బోతరు.

గా యెంకట్రామిరెడ్డి పటేల్‌కు ఊరు శివార్లవున్న భూమంత ఆయన్దె — పొరుగూర్లలో గూడ భూముంది—కంచె (చిట్టడివి) నే రెండొందలెకరాలుంది. యింక బావులు బందములు గాక — ఊర్లెవున్న రాములవారి గుడికిందవున్న అరువై యెక

రాల భూమి కొడుకు సీతారామిరెడ్డి పేర రాయించిండంటరు - ఎన్కటి పెద్ద మనుషులకు పైస మిత్తీలకిస్తడు – కంచె పుల్లెర కిస్తడు. శింతశెట్ల అర్రాసుపెట్టి వొచ్చిన పైసలు అయన్నే దీసుకుంటడు – గిట్లజేశి, గట్లజేశే రెండంత్రాల బంగ్ల గట్టిండని అంటరు–

ఇగ వొయుసొయుసు పోరగాళ్ళు–దుడ్డెకు దుడ్డె వున్నోళ్ళు గాల్లు గిల్లు పోరలు పొట్టెగాండ్లు యెంకట్రామిరెడ్డి పటేల్‌ను 'కేర్' జెయ్యరు–జెర్రి గోడ సాటైతేసాలు తిడ్తనే వుంటరు. "కందిరీగ మోగమోడ"ని కొంత మంది 'కత్తర్ నాక్ సాలెగాడు' అని "మందినిముంచి పెద్దగైండ"ని "మంది సొమ్ముల అపా లిచ్చుకున్నడ"ని "మిత్తీలకిచ్చి పెద్దగయిండ"ని "రజాకార్ల వక్తల బంగారం దెంగిపోయిండ"ని "మంది పొలాలు కబ్జ జేసిండ"ని తలా ఒక తీరు తిడ్తరు–

యెంకట్రామిరెడ్డి పటేల్ ఊర్లెవున్న పోరగాళ్ళు తన చేతులలేరని ఎప్పుడో తెల్సుకుండు. యెప్పుడైతే తననికాదని ఊర్లె రైతుల "సంఘం" బెట్టింద్రో గప్పుడే బాగా దెల్సిపోయింది. పోరగాళ్ళు శెడిపోయింద్రని–

'సంఘం' బెట్టిన పోరగాండ్లను ఏమనలేక ఆ పోరల తల్లిదండ్రులను పిలి పిచ్చి జెర దటాంచినట్టు నాలుగు దిట్టిపంపిస్తడు. ఇగ తన శేతుల జిక్కినప్పుడో నల్లిని నలిపినట్టు నలుస్తడు. అప్పుసప్పుకు బోతే పుట్టనీయడు. ఇంత 'తుకం' అంటే, ఇంత 'ఎరువు' అంటే పుట్టనీయడు. గందుకే ముసలోళ్ళు యెంకట్రామి రెడ్డి పటేలుకు యెదురు జెప్పరు. అయ్య పాదాలకు దండంబెట్టి ఎట్లజెప్తెఅట్లింటరు.

ఇక పటేలు సంగతి గిట్లుంటే గా ఊరి కరణం పంతులు మూతునాకులోడు– పనిపాటలోళ్ళకు, ఆళ్ళకు ఈళ్ళకు తాకులాటపెట్టి తమాష జూస్తడు. నాల్ముచ్చి లెక్కల్ ఎక్కువున్నయ్. వాని దగ్గర పది వీని దగ్గరపది ఆ కుర్మోని దగ్గరగొర్రె ఈ కాపోని దగ్గర కోడి దీసుకుని పూశెల్లగొట్టుకుని సంపాదించిదంత మూలకు బెట్టుండని అంటరు ఊర్లె–

ఊర్లె ఒక్కో కోమటోని దగ్గర నూరుతులాల బంగార ముందని, హౌజులు గట్టి హౌజులల్ల పైసల్‌నింపి బెట్టింద్రని ఊర్లే పుకార్– ఇవన్ని మందిని ముంచి దోసుకున్నయేనని ఆడు, ఈడు అంటుంటరు.

ఇగ కాపోల్లుగూడ బలిశె వున్నరు– ఒక్కొక్కనికి బంగ్లలు, మిద్దెలున్నయ్.

ఇగ గీల్లే ఊర్లె పెద్దమనుషులు. ఊర్లె ఎమన్న జరిగితె తశ్వాజేస్తందుకు ఈళ్ళంత గూడుతరు–

యిప్పుడు గూడ పంచాదాఫీసు కాడ గందుకె కూడింద్రు.

యెంకటామిరెడ్డి పటేలుకు జెరదూరంగ కరణం పంతులు కూసుండు. జుట్టు ముడేసు కుంటుండు. నోట్లే శోకలున్నట్టున్నయ్ నములుతుండు. మోకాళ్ళ మీద శెల్లవుంది–ఏదో పుస్తకం పక్కకుంది. పెన్ను అంగికి పెట్టుకున్నడు.

కరణం పంతులుకు దగ్గరగ ఆ వూరి ఆసాములు, సావుకార్లు మిగతా పటేండ్లు కూసుండ్రు-

పంచాదాఫీసు ముంగట జెర దూరంగ ఓ కావలోడు కింద కూసుండు-ఏమి జెప్తె అది జెయ్యనీకి తయారుగున్నడు- సూపులన్ని ఆళ్ళమీదనే వున్నయ్-ఎప్పుడు ఏమి అజ్ఞ ఇస్తరో అని శినిగిన బట్టల్తో శేతుల కట్టె వట్టుకొని నెత్తిమీద రూమాళ్ళ సగందాగిన సుట్టబెట్టుకుని 'కుక్క' లెక్క కూసుండు-

గ పంచాదాఫీసు ముంగట పెద్ద పరుపుబండుంది. ఆ బండమీద అరుగుగట్టింద్రు గా అర్గుమీద జండ పాతింద్రు. మీద రంగువోయిన బట్టపేల్క అటు, ఇటు కొట్టు కుంటుంది గాల్కి-గది మూడురంగుల జెండ లెక్కలేనేలేదు. మూలకు పడేశ్న బట్ట పేగు లెక్కనేవుంది-

పంచాదాఫీసు అనుకొనున్న పీర్లకొట్టం ముంగల "హలాలి" ఆడేగుంటుంది- గా గుంటల బూడిదుంది-బూడ్దెల సల్లకుక్క పన్నది. అప్పుడప్పుడు ఈరీగలు శెవులమీదికి, కండ్లముంగట్కివొస్తుంటే శెవులు అటు, ఇటు అడిస్తుందిగని అండ్ల. కెల్లి లేస్తలేదు. గటునుంచి పోయే పందులు యిటొచ్చి మూర్కసూసి పోతున్నయ్

పంచాదాఫీసు గోడకైతే ఏవేవో రాతలున్నయ్- కొన్ని గనిపిస్తున్నయ్- కొన్ని గనిపిస్తలేవు- జెర దగ్గర్కివోతే జెర, జెర గన్పిస్తున్నయ్- కొన్ని ఎన్నో ఏండ్లనాడు రాసింద్రు- కొన్ని మొన్న మొన్న రాసింద్రు- మొన్న మొన్న రాశిన యైతే యెర్రగ గనిపిస్తున్నయ్. కొన్ని బొగ్గుతోటి రాశింద్రు పోరగాండ్లు. గవి శెడ్డ శెడ్డమాటలు- మాద్గి బీడితోని బొమ్మల్ దించింద్రు గోడలకాడి పోరలు.

జెర, జెర కనిపించే రాతలు గిట్లున్నయ్- 'ఆవుదూడకే మీఓటు'-'బీదల రాజ్యం కావాలంటే కాంగ్రేసుకే మీ ఓటు' "అక్కా నీఓటు ఎవరికే చెల్లే నా ఓటు కాంగ్రేసుకే" గివిగాక "కంకి కొడవలికే మీఓటు" 'కమ్యూనిస్టు అభ్యర్థికే మీఓటు' "సుత్తె కొడవలికే మీఓటు" "జీతాల్ పెర్గాలంటే సుత్తెకొడవలికే మీఓటెయ్యండి."

ఇగ మొన్న మొన్న రాశినట్టుగున్న రాతలు- "దున్నేవాడిదే భూమి" "పోరాడే వానిదే ఎర్రజెండా" "రైతుకూలీల సంఘం వర్ధిల్లాలి"-గట్ల గోడలనిండ రాతలే వున్నయ్. పంచాదాఫీసుకు ఎన్నేండ్లయిందో సున్నమెయ్యక- గందుకనే రాతలన్ని పూర్తిగ నిండిపోయ్నాయి. సున్నం పైసల్ గూడ దిగమింగి కూసున్నరని అంటుంటరు.

గటునుంచి కావలిశంద్రయ్య ఉరుకొచ్చినట్టు వొస్తుండు - దమ్మువట్టింది. పంచాదాఫీసు శేరిండు-కావలిశంద్రయ్య జూసి యెంకట్రామిరెడ్డి పటేల్ మల్ల కాయి దాలు సదువుకుంట "ఏమాయెరా ! అటేపోతివి-దుర్గదొస్తుందా?" అని అడిగిండు-

"లేదు పటేలా-శెరువెన్కకు వోయిండంట నీళ్ళు మల్పనీకి-వచ్చినంక జల్దిరమ్మని యింట్ల జెప్పొచ్చిన" కావలిశెంద్రయ్య.

"నీళ్ళు మల్పనీకి వోయిండా? ఎపనియన్న పీకనీకిపోయిండా ? ... ఏం

పంతులు ఇయ్యాల పంచాదున్నదంటివి—సప్పుడుజెయ్యక గూసుంటివి ఇట్లయితేఎట్ల నిన్న మొన్న శెప్పం పొద్దు ఆ బేకూప్ గాన్కి"—పటేల్.

"శెప్పంపినామయ్య—ఆడు యాదిమరుపులోడు—ఎట్లిన్నడో, ఏమి జేశిండో తెల్వదు—మీదిమోగపోడు ఆడు-కావలి బాలిగాణ్ణి నిన్న రెండుమాట్ల తోలిచ్చిన రెండు మాట్లు గలువలేదంట—యేడికి బోతుండో ఏమో ఎత్కతినతందుకు—ఒక్కొక్కనికి కావరాలెక్కినయ్—కావలోన్కి గూడ కల్వకుంట అయిండ్రు" కరణం పంతులు—

"వాడెందు కొస్తడయ్యో వాడు తానేషైయిండు. దొరవాడు. దొరై యిండు. వాని కొడుకేమో లీడరైయిండు—వాడేమొ దొరైతుండు ఇగవాడెందుకొస్తడు—ఒక్కొక్కనికి తిండెక్కువయితుంది—యిగయేడికెలిపస్తర్-తిండిలేక మలమలమాడుతుంటే కొడుకుల కావరాలు వొంగి అయ్యా నీబాంచన్ అంటరు—ఇప్పుడేడ—మదం మీదున్నరు మాదిగోల్లు...."—పటేలు శిర్రుబుర్రులాడుకుంట అన్నడు—

"రాకుంటే యేడికి వోతరు-పట్టుకొచ్చి వొంగవెట్టి ముడ్డిమీదికలి నాల్గు తల్గిస్తే గప్పుడు శెప్పినట్టింటరు—మల్లోసారి పిలువంగనే ఉరుకొస్తరు—గవి లేకనే శిన్నవోయిండ్రుకొడుకులు—శానరోజులైయింది గదా ఎవణ్ణి సుదురాంచక గందుకనే పెయిలు ముల, ములాంటున్నయ్...." కరణంపంతులు మాదిగోళ్ళ మీదున్న కసంత తిట్లతోటి తీర్చుకుంటుండు—

కాపలి శెంద్రయ్య దిక్కులు సూసుకుంట గట్లనే నిలవడ్డడు—

ఆడ కూసున్న ఆసాములు, సావుకార్లు పటేలు, పంతులు దిక్కే సూసుకుంట తమ ముచ్చటేందో మాట్లాడుకుంటుండ్రు— "బియ్యంధర ఎక్కినయంట గదా గంజిల" అని— "అందాలు ఎన్ని సంచులైనయ్" అని— "గడ్డకిందిమైసిగాడు నాకు ఇంకా ఒడ్లు గొలుస్తలేడ"ని— "రేషన్ మీద శెక్కరియ్యకుంటే సాకలోడు శాన శాన ఎగిరిండు" అని "మొన్న మంగలోడు గడ్డంగీకురా అంటే పెండ్లికి పోతున్నా అని తోక పీకిండ"ని "కొనింటి పోశిగాని కోడలు శాన వుశారుంద"ని గిట్ల మాట్లాడు కుంటుండ్రు—.

మాదిగ దుర్గడు ఇంక రాలేదని పటేలు కోపంల వున్నడు— జర గరాన్కి వొచ్చిండు—గులుగుతా వుండు-వాడు రాకపోయెనని—

ఆడ కూసునోళ్ళంత జెరసప్పుడు జెయ్యక కూసుండ్రు-కావలిశెంద్రయ్య అట్లనే నిలవడ్డడు పక్కకు—పటేలు దిక్కు బయం బయంగ జూస్కుంట—

కరణం పంతుల్కి చైన్ పడ్తలేదు—దమాకంత కరాబయింది. ఏమేమో అనుకున్నడు—ఏమేమో శెయ్యాలనుకున్నడు—కని ఏమిసమజ్ ఐతలేదు. దమాకంత గిర్రున తిరుగుతుంది—

యెంకట్రామిరెడ్డి పటేల్కైతె యేమి తోస్తలేదు— యెవన్ని తిట్టాల్నో

యెవన్ని కొట్టాలో్న తెలుస్తలేదు. నోట్లె నోట్లనే తిట్టుకుంట జేబులకెలి శిగిలేటు డబ్బి దీసి శిగిలేటు ముట్టించిండు—

గట్టిగ ఓ దమ్ముగుంజి "ఒరే శంద్రిగా మాదిగ దుర్గడు యేడేడ వుంటడో సూసినావురా? ఆ కల్లుదుకాండ్ల... అడాడ సూసిరాపో!"

"సూసొచ్చిన పటేలా, అదంత సూశే యింటికిబోయిన యింటికాడాలేడు—యింట్లలేకుంటెనే పోశికి శెప్పొచ్చిన—వొస్తే జట్‌న పంచాదాఫీసు కాడికి రమ్మని" యేడ రంజిగ మాట్లాడితే తంతడేమోనని మెల్లగ జెప్పిండు శంద్రియ్య—.

యెంకట్రామిరెడ్డి పటేలు జరకండ్లు పెద్దగజేసి శెంద్రిగాన్ని ఒక గడియ సూసి "పోశియెవతిరా?" అని కండ్లు మిట్కరిచ్చి అండు.

"శెప్పాల్నా ?వొద్దా ? శెప్పాల్నా ? వొద్దా ? శెప్తె ఏమని శెప్పాలె" అని శెంద్రిగాడు మనసులనే అనుకొని, జెరసేపు తత్తర బిత్తరపడి "దుర్గనిపెండ్లామే పటేలా" అని అన్నడు.

"ఆఁ...లంజముండను గూడ రమ్మనొద్దురా ? పంచాదికాడికి—దాని కొడుకు జేసిన లెక్కల్ యింటుండే...కుక్కను కన్నట్టు కనిపారెయ్యంగనే అయిపోయిం దంటనా? దాని తల్లీ..." పటేలు శెడ్డ శెడ్డ మాటలు తిట్టిండు—

శంద్రిగాడు నీళ్ళు మింగుకుంట సప్పుడు జెయ్యకుంట నిలబడ్డడు.

"కావరంబట్టి, మదమెక్కి ఎనిమిది మందిని, తొమ్మిది మందిని కని పెంట మీద పారేశినట్టు పారేస్తరే లంజలు—ఊరి మీద బలాదూర్‌గ తిర్గుతరు పెద్దగైనంక—అకరా ఫికరా తినేయాళ్ళకు ఇంత ముంగటికొస్తే సాలాయె—పొద్మికితే ఇంత యేసు కుంటే సాలాయె లంజకొడుకులకు..." అని యెంకట్రామిరెడ్డి పటేలు నోట్లె నోట్లె తిట్టిండు—

శంద్రయ్య మనుసు కష్టమైంది— "ఇంత కుక్కలెక్క ఏన్జేశినా యేదో ఒక వంక బెట్టనే వుంటడు పటేలు" అని "ముందేమో దుర్గనికి శెప్పిరమ్మని జెప్పి యిప్పుడేమో పోశిని రమ్మనొద్దా ?" అన్నందుకు శంద్రయ్య మనుసు యేదోతీర్గ అయింది—తప్పు జెయ్యకున్న పధిమందిల తప్పు జేశిండు అంటే ఎంత కష్టమని పిస్తదో మనిషికి శంద్రయ్యకు గూడ గంత కష్టమనిపిచ్చింది—సుండ్లమీద నిల బడ్డట్టు నిలబడ్డడు శంద్రయ్య పటేల్, కరణాల ముంగల—ఇంగలాల మీద నిల బడ్డట్టు నిలబడి కదుల్తె ఏమంటరో అని కదులకుండ మనసును చంపుకోని నిల వడ్డడు—

యెంకట్రామిరెడ్డి పటేలు గులుగుకుంటనే కాయిదాలు సూస్తుండు—

సావుకార్లు, ఆసాములు యెంకట్రామిరెడ్డి పటేలు మాట్లాడినంతసేపు చప్పుడు జెయ్యక గప్‌చుప్‌న వుండి పటేల్ నోటిమాట ఆగిపోంగనే ఆళ్ళ మాటలు అళ్ళు మాట్లాడుకుంటుండ్రు—

ఇగ కరణం పంతులు అన్ని దికుల సూసుకుంట జంధ్యం తోటి ఈపు గోక్కుండు, ముఖమంతరిల్లిచ్చి—

నోట్లెవున్న ఊము పక్కకుంచి శెల్లతోటి మూతి తుడ్సుకోని "శంద్రిగా! వాని కొడుకు గిట్ల కనబడ్డాడురా గుడిశెల" అని అడిగిండు పంతులు

శెంద్రయ్య పంతులు దిక్కు సూపులు మల్పి "లేదు పంతులు కన్పియ లేదు..." అని మెల్లగన్నడు—

పంతులు పాణం జెర సల్లబడ్డట్టయింది—ఎందుకో ఏమో మొఖం మీద జెర తెలివి కన్పిచ్చింది—తను అనుకున్నది అయినందుకు ఎవ్వల్కి తెల్వకుంట పండ్లు బయటపెట్టి ముసి ముసిగ నవ్వుకుండు—

మాదిగ దుర్గని కొడుకు సాయిలు ఊర్లె వుంటె పంచాదు తశ్వ కాదనే అడు లేనప్పుడు సూశే పంచాది పెట్టిండు పంతులు—

అసాములు, సావుకార్లు ఆడకూసోని శానసేపయింది—ఒక్కొక్కర్కి యాష్టొస్తుంది—అయిలు తీసుకుంట, బొర్రలు నిమ్రుకుంట, శిటికెలేసుకుంట మనసెంత యెటో పెట్టి ఒట్టి శత్తను పంచాదాఫీసుకాడ పెట్టింద్రు—ఏమి జెయ్యాల్నో యెవర్కి తెలుస్తలేదు—ఆడికెలి యెల్లిపోతే యెంకట్రామిరెడ్డి పటేల్ ఏమంటడో అని భయం.. నెత్తిగోక్కుంట పెయ్యిగోక్కుంట శిరెత్తినట్టుంది అందర్కి. ఆ శిరెవరి మీద తీయాలో తెలుస్తలేదు. "ఎందుకొచ్చినంరా పని యిడ్శి పెట్టుకుని'' అని అనుకుంటోళ్ళు అనుకుంటనేవున్నరు—

పొద్దుబాగనే అయింది - ఎండ నెత్తిమీద కొస్తుంది. మాదిగ దుర్గడు యింక రాలేదు. యెంకట్రామిరెడ్డి పటేల్ గడియాల్ జూసుకుండు. పండ్లు "పట పట" మన్నయ్- మొఖమంత యెర్రగయింది- ఇజ్జత్ పోయినట్టయింది- మన్సు పాడై యింది- శిగిలేటు దమ్ము గట్టిగ గుంజి పొగ గాలిలకు యిడిశిండు, గాపొగ అయ్న మొఖం మీదనే తిర్గుతుంది- శెత్తోటి అటు ఇటు అండు-

కావలి శంద్రయ్యకు ఎటు తోస్తలేదు— పంచాదాఫీసు గోడదిక్కు జర్గి నిల వడ్డడు— శంద్రిగాని మన్సుగూడ బాగలేదు. శంద్రయ్య దమాకంత ఫికర్లతోటి నిండిపోయింది— కావలి కట్టె మీద గదుపపెట్టి జండకాడ శీమలన్ని గల్శి ఏమో పీక్కతింటుంటె గటుదిక్కు సూస్తుండు— టీరపోయినట్టు గదే సూస్తుండు— శీమల సూస్తుంటే గదే సూడబుద్ధయింది శంద్రయ్యకు—ఏమేమో సోంచి జేసుకుంట యెర్రి పట్టి సూస్తుండు—...యెంకట్రామిరెడ్డి పటేలు నోరు సప్పుడు యినరాంగనే గజ్జున వణ్కి బెదురుకుంట, బెదురుకుంట పటేలు ముంగటి కొచ్చిండు—

యెంకట్రామిరెడ్డి పటేలు నోట్లె శిగిలేటు తీసి బయటకు పారేశి ఒక్కసారి తుపుక్కున ఊంచి శంద్రయ్యను పిలిశి—

"ఒరే శంద్రిగా... ఆ దుర్గని దగ్గర్కివోయి వస్తడో రాడో అర్సుకరాపో— లేకుంటే పోలీసు ఠాణకు పట్టియ్యమంటడో అడుగు— రోజు రోజుకు దిమాకులు

ఎక్కువై తున్నయ్ లంజకొడుకులకు- యేలెడంతలేని లంజకొడ్కులకు ఎయ్యేన్గుల బలమొస్తుంది- యేడికెల్లొస్తుందో తెలుస్తలేదు కొడుకులకు......"

శంద్రయ్య తల్కాయ వూపుకుంట ఆడికేలి కదిలిండు- శంద్రయ్య ఆడి నుంచి కదిలినంక గూడా పటేలు తిడ్తావుండు...

"యెత్కతినే లంజకొడుకులకు ఏమి పొగరొచ్చినా వొచ్చింది- కంటికి కన బడకుంద అయింద్రు కొడుకులు- గంజి గట్కపోయి ఇంత బువ్వతిన నేర్శింద్రేమో ఒక్కొక్కని కండ్లు నెత్తిమీది కెక్కినయ్ - బలుపెక్కింది ఒక్కొక్కనికీ-కావరిం వొంగే యెట్టికొట్టం లేకపాయే... యెవడు శేతుల లేకుంట అయింద్రు యిగయేడికేలి ముంగల పడ్తం..." అని-

"ఏమయ్యా పంతులు...... గిట్లైతే ఎట్ల? ఎంతసేపు కూసుందాం ఈడ? నీ లెక్కఏందో? నీ కథ ఏందో? నాకేం అర్థమయితలేదు- ఎద్ద అన్యాయమై పోయింది..." కరణం పంతుల్ని సూసుకుంట అన్నడు పటేలు.

కరణం పంతులు సూపులు జెరసేపు ఆగమాగమైనయ్.

"నేనేం జెయ్యాల్నయ్యా, నేనేమిజెయ్యాల్నో జేస్త- ఎన్ని తీర్ల జెయ్యాల్నో అన్ని తీర్లచేస్న- వానింటికి రెండు రోజులనుండి కావలోన్ని పంపియ్యనేబడ్తి- నీ కండ్లముంగటనే రెండుసార్లు పోయినా కలుపలేదని వచ్చే కావలోడు- రెండు దినాలనంది గిదే ఏశం. 'ఈడ ముస్గుతడు ఆడ తేల్తడు' అన్న ఏశమయింది. ఇగ నేనేమి జెయ్యాలె - గింత మగర కెగబడ్డరు మాదిగముండకొడుకులు యిగ యేడి కేలి ఐతది- ఒక్కడన్న శేతులలేడు- ఎవని రాజ్యం అనిదై నట్టయింది..."

అని కరణం పంతులు తొవ్వలు సూస్తుండు- దుర్గడుగిట్ల వస్తుండేమోనని కండ్లద్దాలల్లకేలి పరీక్షగ సూసిండు- సూస్తే అటు కేలి సాకలోడు బట్టలమూట ఎత్తుకోని పోతుండు, కాని దుర్గడు కనబడలేదు.

పంతులుకు అరికాలిమంట నెత్తికెక్కింది-గంత కోపమొస్తుంద్. కాని యేమి జేయజాల్త లేదు- యేమి జెయ్యాల్నో దెలుస్తలేదు. దమాకంత యిదిగా త్రయా రయింది- నెత్తి పల్గిపోయేటట్టు సోంచిజేస్తుండు కాని యేమి అర్థమయిత లేదు- యెటూ తోస్తలేదు- నోట్లె, నోట్లె ఏమేమో తిడుతావుండు- గాతిట్లు ఆయనకే దెలుస్తలేవు ఏమి తిడుతుండో-

సావుకార్లు, ఆసాములు యిరకాటంల వడ్డట్టు యెటుబోకుంట ఆడనే కట్టేసినట్టు కూసున్నరు. మాటలుకూడ మాట్లాడ్తలేరు- సప్పుడు జెయ్యక కూసుంద్రు- యెవరి సోంచిల ఆళ్ళున్నరు-

యెంకట్రామిరెడ్డి పటేల్ ముంగట పచ్చిగడ్డి ఏశినా 'బగ్గున' మండెటట్టుంది. గంత కోపంల వున్నడు. గా కోపంలనే శిగిలెట్ దీసి అగ్గిపుల్ల గీరి శిగిలేటు ముట్టిం చిండు- అగ్గిపుల్ల అంతదూరాన యిశిరి పారేసిండు- గట్టిగ ఒక్క దమ్ముగుంజి పొగ గాలిలకు యిడిశిండు-గాపొగ ఆడనే వుంది- ఆడనే తిర్గుతుంది- పొగ కండ్ల

శ్నకు పోతుంటే చెయ్యితోటి అటు, ఇటు అన్నడు— పొగ జెర దూరం బోయింది. పొగను శెయ్యితోటి అటు, ఇటు అంటుంటే సూపు తొవ్వమీద వడ్డది— జెర్రదూరం శేలి దుర్గడు, కావలి శంద్రయ్య వస్తున్నరు—

మాదిగ దుర్గని సూడంగనే పటేలు పండ్లు పట, పట మన్నయ్. కండ్లు ఉరిమి ఉరిమి జూసినయ్— గుండెకాయ బుస్సున పొంగింది— శేతులున్న శిగిరేటు పెదవుల సందున నలిగింది.

మాదిగ దుర్గయ్య, కావలి శంద్రయ్య పంచాదాఫీసు కాడికొచ్చిండ్రు.

కావలి శంద్రయ్య పీర్ల కొట్టం దిక్కు జరిగి నిలబడ్డడు — మాధిగ దుర్గడు రెండు శేతులు జోడిచ్చి వొంగొంగి "దండాలు దొర! దండాలు" అన్నడు - గట్ల వొంగినప్పుడు శేతులు కడుపుల కొచ్చినయ్ - యెంకట్రామిరెడ్డి పటేల్ దుర్గని మింగేసెటట్టు సూస్తుండు—

దుర్గయ్య మాత్రం పటేల్ కండ్లల్లకు సూస్తలేడు — ఎదో బుగులు బుగులు తోటి సావుకార్లు, ఆసాముల దిక్కు సూస్తుండు ... అంతట కలియ జూస్తుండు— కరణం పంతులు దిక్కుసూసి "దండాలు పంతులు" అని అన్నడు—

కరణం పతులు ఉరిమురిమి సూసుకుంట

"దండాలే పాణగండంరో —దండాలు బాగనే వున్నయ్ గని..."

దుర్గయ్య గొంతు యెండిపోయి నట్టుఉంది కరణం సూపులకు మాటలకు— నోట్లవున్న వూము ఒక గుటక మింగి, రెండుశేతులు జోడిచ్చి, కండ్లళ్ళ నీళ్ళు నింపుకుని వనుకుతున్న పెదువులతోటి

"గట్లంటవేమి పంతులు — మీగులాపోల్లం — ఎన్నడులేంది శెత్రంగ మాట్లాడ వత్తిరి..."

కరణం పంతులు యెంకట్రామిరెడ్డి దిక్కు తిర్గిండు — యెంకట్రామిరెడ్డి దుర్గయ్యను నమిలేశెట్టు సూస్తుండు — సావుకార్లు, ఆసాములు ఈ ముగ్గుర్ని సూస్తూవున్నరు—

పటేల్‌ను సూసుకుంట పంతులు

"అగ సూడయ్యా! గులాపోడంట ఈ మాదిగ ముండకొడుకు" అన్నంగనే పటేలు పంతుల్ని మింగేశెటట్టు సూసిండు — గట్ల సూడంగనే పంతులు దుర్గయ్య దిక్కు తిర్గి

"అరే మాదిగ ముండకొడుకా ఎవన్కిరా నువ్ గాయిది పనిజేశింది? ఎవన్కిరా నువ్ యెట్టిపని జేశింది? ఎవన్కిరా నువ్ బాంచ పనిజేశింది?" అని గదిరిచ్చిండు—

దుర్గయ్య నోట్లె వూరిన నీళ్ళు మింగి మెల్లగ

"గిప్పుడు జెర గాయిదు పని, బాంచపని దప్పిందిగాని నా శిన్నతనంల మేం శెయ్యకుంటె యెవరు జేసింద్రు పంతులు ... అంటే కోపాన్కి వొస్తరు గాని..."

పంతులుకు అగ్గిమీద గుగ్గిలం ఏశినట్టయింది.

"గప్పటి మాట యెవన్కి గావాల్రా, గిప్పటి మాట మాట్లాడు..."

యెంకట్రామిరెడ్డి పటేలు పని తెగిన శెఋవు లెక్కయింది – పంతులు మీద, దుర్గయ్యమీద పట్టరాని కోపమొచ్చింది–

"ఏందయ్య, ఏ మాట్లాడ్తున్నవ్ అనితోటి – నువ్ మాట్లాడ్తున్నకొద్ది ఆడు నెత్తిల ఎక్కుతున్నడు – గిప్పడు గవన్ని యిడ్శిపెట్టు – ఇయ్యాల్టి సంగతేందో, ముచ్చటేందో దబ్బునగానియ్యి - ఏదో వైనంజేస్తున్న వేంటిదయ్య – అనితోని వొర్లుకుంట కూసుంటె మన పనులైనట్టే – ఆళ్ళ పని తర్వాత జేస్తనుగాని ఇయ్యాలటి ముచ్చటేందో గానియ్యి..." పంతులును సూసుకుంట అన్నడు–

పటేలు గట్ల అనంగనే మాదిగ దుర్గయ్య గజ్జున వణికిండు – ఆసాములు, సావుకార్లు - కావలోళ్ళు బిత్తరపోయి సూస్తుంద్రు–

దుర్గయ్య ఇంక జెరముంగటికి వొచ్చి రెండుశేతులు జోడిచ్చి – పటేలు కూసున్న కాళ్ళకాడ మొక్కి–

"మీకు దండం బెత్తదొర, గంత కోపాన్కి రాకుంద్రి – గాయిదు పని జేసుకుని బతికెటోళ్ళం - గరీబుగాళ్ళం మామీద దయవుంచుంద్రి - మీరు తొక్కకుంటబోతే మీ కాళ్ళ దుమ్మొంబడి వొచ్చెటోళ్ళం – జెర కన్ను ఒంకర బెట్టి సూడకుంద్రి దొర – మీ గులాపోల్లం..." అన్నడు.

"ఈ నక్కజిత్తుల మాటలు యెన్కసీరికి గని ముందుగాల్ల గీ పంచాదేందో తెగనీ..." పటేల్ అన్నడు–

"నరికినా మీరే...సాదినామీరే ... మీగులాపోళ్ళం – దండం బెత్త" అని దుర్గడు మల్లొకసారి పటేల్ కాళ్ళకు మొక్కిండు –

"ఎవణ్ణి ఎవడు నర్కుతడొ – ఎవన్ని ఎవడు సాదుతడో ఎవన్కి ఎర్కగాని... ముందుగాళ్ళ ఈ సంగతి గానియ్ –" పటేలు

"ఏ సంగతి దొర నీ బాంచన్..." దుర్గయ్య

"ఈడ పంచాదెందుకు పెట్టింద్రనుకున్నవ్రా ... తిన్నదర్గక పెట్టింద్రనుకున్నవా?..."

"గట్లంటనా నీ గులాపోణ్ణి"

"నీ కొడుకేదో సంఘం బెట్టిండంటగదరా? ఊర్లె ఉండ బుద్దయితుందాలేదా? పెయ్యిల ములుగిట్ట మొలుస్తుందా?..."

"వొద్దురా అంటెయినకుంట 'సంగం, సంగం' అని సంఘం బెట్టిండు– నేనాడికి ఎంత జెప్పిన దొర, మనసుంటోళ్ళ కిది లాయకు గాదురా అని బదగరిచ్చి అదగరిచ్చి జెప్పిన నా మాట శెవుమీధ పెట్టక ఆడు సంఘం బెట్టనే బెట్టిండు..."

"సంఘం బెట్టిండని అందర్కి తెల్సురా—సంఘం బెట్టె ఎట్ల ? ఇది ఊరా ? పాడా ? ఏందన్నట్టు ?—ఊరు కట్టు మీద లేకుంట, నీ కొడుకు బట్కాయించు దామనకుంటుండు— ఊరు కట్టు దప్పితే ఎవని యిష్ట మొచ్చినట్టు ఆడు తిర్గితే ఊరే అంటరా ఇది..." పటేలుకు జర్ర కోపం తగ్గింది—

"దొరా నీ గులాపోణ్ణి—నన్ను నీ యెడమకాలి శెప్పు తోటి కొట్టు పడ్త... ఆనికి శిల్కకు శెప్పినట్టు శెప్పిన దొర—వొద్దురా ఇది తగని పనిరా, తాకులాట పెట్టి తమాష జూస్తరులోకం రేపేదన్న ఆపతి, సంపతి వొస్తే ఉన్నోరోళ్ళు ఆదు కుంటరుగని పొరుగూరోళ్ళు ఆదుకోరురా, ఉన్నూరూళ్ళతోటి కంటు అయితే ఎవడు శేతుల ఉచ్చ బోయడ్రా అని శెప్తి...అయినా ఆని మొండి పట్టు ఆన్దే దొర నీ బాంచన్..." అని మల్లొక సారి దుర్గయ్య పటేల్ కాళ్ళకు మొక్కిండు

"నువు శెప్పినవ్రా, శెప్పలేదు అంటలేను—మరి ఊరి కట్టు, ఊరి ఉలుకు సంగతెట్ల ? ఊర్లె సాకలోడు, మంగలోడు— బైండ్లోడు, బ్యాగరోడు, కుర్మోడు, కుమ్మరోడు, కావలోడు, నీరడోడు పనిపాటలోళ్ళు అందరుండిరి—ఎవన్ని బట్టె ఆణ్ణి బట్కాంచి అది జెప్పి ఇది జెప్పి ఊర్లెఏమన్న జర్గితే ఎవని మీద పడ్తదిరా-

దుర్గయ్య నోరెత్తలేదు

"సప్పుడు జెయ్య కండిరా—" యెంకట్రామిరెడ్డి పటేల్—

"ఈడు గిట్లనే అంటడు—ఈడు ఆడబోయి సంఘంల పోరలను జేర్పిస్తడంట ఈడు—నాకు బ్యాగరోడు జెప్పిండు——ఈడు మూతునాకులోడు—ఈణ్ణి నమ్మొద్దు— సూస్తే ఎట్లున్నడు సూడు నల్లికుట్ల—ఏమెర్గనోని లెక్కనే వుంటడు ఎడ్డి కొల్లి గాడు...'' అని పంతులు అందుకున్నడు—

నల్గురి ముంగట దుర్గయ్యను కొట్టి పియ్యాలని పంతులు ఇష్టంలవున్నది— పటేలుకు దుర్గయ్యని కొట్టక తిట్టక వొట్టలు పిశికెయ్యాలనుంది—

"నేనే శిన్నప్పట్నుంచి ఎట్లతిర్గిన్నో మీ యందర్కిగుర్తు—ఒగరి కండ్లళ్ళ పండ్లళ్ళ లేకుంట నాపనేందో జూసుకుంట—వున్ననాడుతిని లేనినాడు కడుపులకు కాళ్ళు ముడ్సుకొని పండుకున్న—ఒగని జోలికి పొయేటోణ్ణి గాదు—ఒగని అంటు, సంటుకు తిర్గెటోణ్ణిగాదు—సచ్చెయ్యాలకు గిప్పుడు నిందమోపితే ఎట్ల పంతులు...?

పంతులు దిక్కుసూసుకుంట అన్నడు దుర్గయ్య—

దుర్గయ్య బుజం మీదున్న గొంగడి జారిపోతుంటె సరింగ ఏసుకుని నెత్తి కున్న రుమాళ్ళ 'కరకు' సుట్ట వున్నదోలేదో శెయ్యితోటి సూసుకుని నిలవడ్డడు.

పంతులు, పటేలు సావుకార్లు ఆసాములు కూసున్నరు—

ఎండకు దుర్గయ్య రెట్టకున్న యెండి కడెం మెరుస్తున్నది. వేలికున్న రాగివుంగరం 'మండుతున్నది'—ఎండల నిలబడ్డడు—

"శెడు కాలంల దుర్బుద్దులు రాకుంటే ఏం జేస్తయిరా" పంతులు

"పంతులూ నీ కాల్మొక్త—గట్ల మాటలని నన్ను జంపకు—"దుర్గయ్య

"ఏందిరో మాటలనంగనే సస్తున్నావ్‌రా... ? ''

"నేనిదివరకు ఈపజీత పడలేదు—నాకెర్కలేదు—మీరంటున్న మాటలకు నా కార్జంతూట్లు పడ్తుంది—ఇదివరకు నల్గురిట్ల వొచ్చి మాట్లాడినోన్నిగాను—పంచాదులల్ల తిర్గినోన్నిగాను – నీ కాల్మొక్త, దండంబెట్త..."

"అరే... కాళ్ళు మొక్కుడు యెక్కసీరికి గని – ముందుగాళ్ళ నీ కొడుకు సాయిలుగాణ్ణి ఆ సంఘం బంద్ జెయ్యిమను..." పటేలు

"శెప్త దొర – నీ కాల్మొక్త"

"మల్ల కాల్మొక్తనంటవేమిరా – రేపు మాపట్కల్ల సంఘం గింఘం నప్పుడు ఏమినిపియ్యొద్దు – ఇన్పిచ్చిందో – ఇగ నేనేంజెయ్య పోలీసుకు పట్టిస్త – పోలీసుకు పట్టించినంక ఏమైన అయితే నాకు దెల్వదు..."

'పోలీసు' అన్నంగనే దుర్గయ్య కడుపుల బుగులయ్యింది – కుతికె ఎండుక పోయింది కాళ్ళు వొణికినయ్. గొంగడి జారింది - పెదుగులు వొణికినయ్ – ఎంటనే మాటరాలేదు.

"పోలీసుకు గిట్ల పట్టియ్యకుండ్రి నీ కాల్మొక్త – నీ గులాపోణ్ణి. ఆడు శిన్న పోరడు తెలిసో, తెలియకో జేశిండు – అన్కి నేనే సచ్చజెప్పుత – ఎన్క ముందు లేనోళ్ళం – పచ్చులోతె బతుకుతున్నం. దొరా మీ కాల్మొక్త..." అని దుర్గయ్య, పటేల్ కాళ్ళమీద పడబోయిండు.

పటేలు కాళ్ళు యెన్కకు తీసుకుని "అరే కావలోడ" అనంగనే దుర్గయ్య యెన్కకు జరిగిండు.

"ఆడు శిన్నపోరడా? అరె కావలోడ వీని నోట్లె ఊంచురా – ఆడు శిన్నపోరడారా? ఆడు నిన్ను నన్ను అంగట్ల అమ్ముకొస్తడు. నోట్లె ఏలుబెట్టె శీకుతాండ్రా – నీ కొడుకు ఇంకా శిన్నపోరడారా? అగో గోడలమీది రాతలుసూడు ఎట్లున్నయో – శిన్నపోరన్కి గవన్ని ఎందుకురా – నిన్ను ముందుతంతె ఆను సక్కగైతడు – అమీన్‌సాబుకు జెర శెప్పులేస్తినాంటే నీ పని, నీ కొడుకు పని సంఘంల వున్నోళ్ళ పని సక్కగైయితది – సంఘమంటె నువ్ తమాషనుకుంటున్నావురా – జెరంత బలముంటెనే సంఘం బెట్టిండ్రు – శాన బలముంటె ఏమి జేస్తర్‌రా? మంచిమాటకు శెబుతున్న మీ పోణ్ణి సంఘంలకెలి యెల్లిపొమ్మను—ఆడు యెల్లిపోతే సంఘముండది—గింగ ముండది. లేకుంటే శాన తక్లీబుల పడ్తరు - ఎన్కసిరికి పరేశాన్‌ల పడ్తె మంచిగుండది గప్పుడొచ్చి నన్ను ఆదుకోమంటె నాతోటిగాదు—ముందే శెప్పుతున్న నీ యిష్టం—" అని పటేలు దుర్గయ్యకు ఉపదేశమిచ్చిండు—

దుర్గయ్య ఆలోశనల వడ్డడు—

కరణం పంతులు తన పెద్దరికం సూపెట్టుకోవాలని

"అరే దుర్గా నీ కొడుకును ఈ గోడలమీది రాతలు మలిపెయ్యమను. ఇయ్యాల రేపట్ల తహసిల్దారు, గిర్దావరు, అమీన్‌సాబ్ వొస్తరంట. ఆళ్ళు సూస్తె బాగుండది–" అన్నడు–

దుర్గయ్య పంతులు దిక్కు తిర్గి

"అడు పట్నంబోయి మూడ్రోజులైయింది – రాంగనే మీ దగ్గర్కి తీస్కొస్త పంతులు–..."

"నువ్ తీసుకొస్తే ఆడు రావాలెగదిరా?"

"రాకేం జేస్తడు పంతులు – తోలుకొస్త."

"తోల్కరావుడు గాదు ముందుగాల్ల సంఘం, గింఘం మానుకోమను–అండ్ల వున్నోళ్ళకు గిట్లజెప్పు ఎన్కసీరికి పస్తాన్‌ండ్ల వస్తె మంచిగుండది అవుసుగాని నీ కొడుకు పట్నమెందుకు వోయిండురా అన్కి పాల్టితోటి మిలాకత్‌వుందా?..."

"ఎమో పంతులు నా కెట్ల ధెలుస్తది నీ కాల్మొక్త"

వాణ్ణి జెర శేతులుంచుకో, పొలంకాడ వొంగబెట్టు – నాగలి, దీగలి దున్ని పిస్తే జెరకష్టమేందో తెలుస్తది. గప్పుడు ఇంట్లనే పడి ఏడుస్తడు–ఊర్లె ఎట్లుండాలె ? నల్లురు అవునన్నట్టు వుండాలె-గివేం లంగలెక్కల్‌రా మాకుకొడుకులు లేరా, నీ కొడుకు లెక్క ఊర్లె మీదపడి తిరుగుతున్నార? వూర్లె ఒక్కడే వున్నాడు నీ కొడుకు–పెద్ద మొనగాడై పోయిండు నీ కొడుకు–నాశేతులుంటే నల్లిని నలిపినట్టు నలుస్తుంటి గిసుంటి లెక్కల్ జేస్తే–గంత శేతుల ఉంచుకోకుంటే నీదేంబతుకురా..."

"ఎంత సముదాయించిన పంతులు వానిమాట వానికే... పొలంకాడ యెద్దు లెక్క మగ్గాడతడు– మల్ల సంఘంపని అని ఆపని, ఈపని అని అడికీడికి వోతడు. వొద్దురా అంటె యినడు– "నీకు తెలువదు వూకోవే" అంటడు..."

"వూకోవే అనంగనే వూకుంటావురా శేతుఅంచుకోవాణ్ణి. శివరాత్రి లగ్గాలల్ల లగ్గంజెయ్యి అన్కి– గప్పుడు జెర సంసారమంటె ఏంటివో తెలిసొస్తది– పెండ్లాం పిల్లలంటె ఏందో ఎర్కయితది–..."

"పెండ్లి జేసుకోరాంటె...నా కెందుకే గిప్పుడు పెండ్లి అంటడు- ఆనితోటి మాట్లాడేది కష్టమయింది– అన్నిటికి అన్నే గెల్వాలె అంటడు..."

"మరి ఎట్లంటవురా ఇప్పుడు?" పటేలు–

"వాడు రాంగనే మీ కాళ్ళదగ్గర్కి తీసుకొస్త పటేలా" –దుర్గయ్య

"తీస్కరాకడ గాదురా, సముదాంచు అన్కినచ్చజెప్పు ఊరుకట్టు శెడిపోకుండ వుండాలని శెప్పు..."

"గట్లనే సీకాల్మొక్త... జెర కన్ను వొంకరబెట్టి సూడకుండ్రి మీ బాంచెన్– ఏదో తప్పయింది– ఉడుకు రక్తంల పోరడు ఏది జేసిన మనుసులవెట్టుకోకుండ్రి– మీ మీద పంతంగట్టి పెరాయి వూర్లెకు పోయెటట్టున్నమా? మీ దయలేందే బతుకు

తున్నాం పటేలా. కలో, గంజో మీ కాళ్ళకాడ బతుకుకుంట తాగుతున్నం. యిరో ధాలు వెట్టుకోకుండ్రి... తన్నినా దగ్గర్కి తీసినా మీ గులాపోళ్ళమే..."

"గులాపోణ్ణని నువ్వనబట్టివి. కొడుకేమో సంఘంపెట్టవట్టె..."

"తప్పయింది పటేలా— ఆన్కి సంఘంజోలికి పోవొద్దని జెప్త— ఇంత జెప్పినా పోతాంటే ఆడు నా కొడుకు గాదు— నేను ఆన్కి తండ్రినిగాను— నా కడుపుల పుట్టలేదనుకుంట... నా కడుపుల శెడి పుట్టిండనుకుంటా..." అని దుర్గయ్య ఏడిశిండు— కండ్లపొంటి నీళ్ళు దుంకినయ్.

"అరే దుర్గా ఈడెందుకు ఏడుస్తవ్... ఏదో తప్పయిందని పటేల్ కాళ్ళు ఆసాములు సావుకార్ల కాళ్ళు మొక్కిపో..." పంతులు.

దుర్గయ్య నిలబడ్డదగ్గరకెలి ముందుకు వొచ్చి పటేలుకాళ్ళు మొక్కవోయిండు— పటేలు కాళ్ళు ఎన్కకు దీసుకుని— "ఈ పాపం ఎవడు గట్టుకోవాలాని" అన్నడు.

ఆసాముల, సావుకార్ల కాళ్ళు మొక్కనీకి ముందుకు నడిశిండు— కొందరు కాల్లు యెన్కకు తీసుకుండ్రు— కొందరు తీసోకలేదు— యెన్కకు కాళ్ళు తీసోకనోళ్ళ కాళ్ళు మొక్కి మల్ల పంచాదాఫీసు ముందట నిలవడ్డడు—

"యిగపో పొయ్యి కొడుకొస్తె సముదాంచుపో" అన్నడు పటేలు.

దుర్గయ్య ఆడికెలి కదిలిండు— మనసంత బెంచలమైయింది.

పంచాదాఫీసు కాడ కూసున్నోళ్ళుగూడ లేశిండ్రు— యెవరి ఇండ్లకు అళ్ళు పోతందుకు పటేల్ అజ్ఞ అడుగుతుండ్రు—

★ ★ ★ ★

దుర్గయ్య గుడిశెకాడి కొచ్చిండు— మనుసుల మనసులేదు. పటేలు మాటలే యాదికొస్తున్నయ్. పోశమ్మ మాట్లాడిచ్చినా మాట్లాడకుంట గుడిశెముందు యాప శెట్టుకింద గొంగడేసుకుని వొరిగిండు.

పోశమ్మ జొన్నలు యిసురుకుంట గుడిశెలనే వుంది.

దుర్గయ్య కునుకుదీసి లేశేయాల్లకు జాముపొద్దుంది. మెల్లగ బుజం మీద గొంగడేసుకుని, సుట్టముట్టిచ్చుకొని పొలందిక్కు పోయిండు—

జెర జెర శీకటి పడుతుంది. సాయిలు గుడిసెకొచ్చిండు. పోశమ్మ జెర సేపు ఏడ్చింది— తల్లిని సముదాయించి కాళ్ల శేతులు కడుక్కోని సాయిలు ఇంట్లనే వున్నడు— పొద్దుగాల జర్గిన పంచాదిని కొడుకుకు శెప్పుతుంది తల్లి— పొలం కాడికెలి దుర్గయ్య వొచ్చిండు—

దుర్గయ్య రాంగనే గొంగడిమూలకేశి కొడుకును జూసి—

"ఎందుకొచ్చినవ్‌రా సాయిలు— ఆ పట్నంలనే సావనుంటివి— ఆ పార్టీలనే తిర్గనుంటివి. ఇల్లు, ముంగిలి అయ్య, అవ్వ వున్నరని వొచ్చినావ్? అయ్యమ్మ ఏనాడో సచ్చిండ్రని అనుకోపో! మాకు కొడుకు పుట్టలేదనుకుంటం పోరా! గిసుంటి ముదనష్ట

పోడు వుండెందుకు – లేకెందుకు– ఉన్ననాడు తింటం– లేనినాడు ముడ్సుకొని పంటం–ఇన్ని రోజులు బత్కలేదా? ఇన్నిరోజుల్నుంచి నువ్వొచ్చిందే తిన్నట్టుంది మేము? నీ యిష్టమున్న జాగలకుపో – నిన్ను అడిగెటోడు ఎవడున్నడు తెగిడిశిన పతంగివై నవ్" అన్నడు.

"అసలేమయిందో జెప్పరాదే– గది జెప్పక ఏదో రామాణ్యం సదువుతున్నవ్– పొద్దుగాల కావలోడు వొచ్చిండంట ఎందుకు?

"నువ్ జేసిన పనికి కావలోడొ స్తడు–రేప్రేపు తలెముంతలు జార్లపడ్తయ్ శిప్పశేతుల పట్టుకుని ఊర్లెత్రిగ్గె గతి ఐతది

సాయిలుకు తెల్సిపోయింది–సంఘం బెట్టినందుకు ఊర్లె పంచాది వెట్టి వుంట రని–పంచాది వెట్టి ఏం జర్గుతదో సాయిలుకు తెల్సు– అన్ని ఊర్లళ్ళ గిట్లనే జరుగు తుంది–సంఘంబెట్టిన పోరగాళ్ళ అయ్యామ్మలపిల్సి బెదిరిస్తున్నరు అనుకుండు సాయిలు–

కొడుకు మాట్లాడకపోయెటాళ్ళ కల్ల దుర్గయ్యనే

"అరె సాయిలు ఊర్లె వుండనిస్తవా ? లేదురా ? లేక ఊర్లెకెలి దెంక పొమ్మంటావా? ఇదేంఫజీతరా? గాలికి వోయె కంప మెడకు సుట్టుకున్నట్టు–గవన్ని మన కెందుకురా యెక్కముందులేనోళ్ళము మనకు గివన్ని అచ్చిరావు–రేపేమన్న అయితే ఎవ్వడ్రా మన సాద్దారు–సల్గురున్నోళ్ళకు, నాల్గుపైసలున్నోళ్ళకు గట్లజేస్తే నడుస్తవి–మనకు నడుస్తదా? గ–జి, గట్కలేక మనమున్నం–గవన్ని యిడ్శిపెట్టు రంగ రంగాని యింతదిని పొలంకాడ పనిజూసుకుని నీ యిల్లేందో, నీ ముంగిలేందో సూసుకోక సంఘాలు, గింఘాలు మనకెందుకురా" అని అన్నడు–తన మాట ఇంట డేమోనని–

సాయిలు సప్పుడు జెయ్యక యింటుండు – ఇప్పుడేమన్న అంటె యింకా ఎర్రెత్తి పోతారని ఏమనకుంట కూసుండు–మల్ల దుర్గయ్యనే కొడుకుతోటి

"సల్గురితోటి నారాయణ అని వుండక సల్గురికి పట్టిలేని సంగతులు నీ కెందుకురా–సల్గురి కండ్లళ్ళ, పండ్లల్లయెందుకురా మనం ? యీడికే అందరు ఆడిపోసు కుంటరు మనమీద–నువ్గిట్ల జేస్తే అళ్ళకు యేడికైతది–నవ్వెటోళ్ళ ముంగట జారిపడ్డట్టు ఐతది–పాలోళ్ళ ముంగట మొఖం గొట్టినట్టు తిర్గక గిదేం లెక్కల్రా?"

సాయిలు మాట్లాడలేదు–పట్నంకెలి తెచ్చిన పుస్తకాలు దీపం యెల్గుకు కన్నులు నులిపి సూస్తుండు–పోశమ్మ పొయ్యికాడ బువ్వ వొండుకుంట ఆళ్ళ మాటలన్ని యింటుంది–మల్ల దుర్గయ్య కొడుకుతోటి

"మన కాన్దాండ్ల ఎవరైన వున్నారా గిట్ల – గిప్పుడు నువ్వొక్కనివి తేలి నవ్రా–అయినగాని నువ్ఒక్కనివి తండ్లాడితే మంచిగైతాదిరా లోకం? వొద్దు బిడ్డా సాయిలు మనకవన్ని వొద్దు – ఏదో ఉన్నదో లేందో నిమ్మలంగ తిని ఇట్లవుండు –

గా పుస్తకాలు గిస్తకాలు తీసి అవతల పారెయ్ పొద్దుగాల్ల ఆ పంచాదికాడ పటేల్, పంతులు ఒక్కొక్క మాటంటుంటే నా కార్జంతూట్లు పడ్డది – గివన్ని మాసుకో బిడ్డ సాయిలు" అని కూసున్న దగ్గరికెలి లేశి సాయిలు దెగ్గిర్కి వొచ్చి బయటపారే ద్దామని పుస్తకాలు శేతుల పట్టుకుండు–

తండ్రి శేతులకెలి పుస్తకాలు తీస్కొని సాయిలు

"నీకు తెల్వదే అయ్యా – పటేల్, కరణాలు గట్ల అనకుంటే ఇంకెట్ల అంటరు? వాళ్ళకు నూర్ల ఎకరాల భూముంది. మన లేనోళ్ళకు పనిపాట లోళ్ళకు సాపంత భూమిలేకపాయె. అళ్ళ భూములల్ల మనోళ్ళే మర్లాడాలే. గట్లమర్లాడినా గంజి కుండది, కుండ కుండది. నువ్ జూస్తున్నవ్ గదనే... దున్నెటోనిదే భూమి కావాలని శాలమంది కొట్లాడుతుండ్రు...." అన్నడు.

దుర్గయ్యా సాయిలు కండ్లల్లకు సూసిండు.

"ఇగో గీ పుస్తకంల వున్నోళ్ళందరూ గిసుంటి కొట్లాటల్లనే సచ్చి పోయిండ్రు" అని ఓ పుస్తకం సూపెట్టిండు.

"గీయన 'కృష్ణమూర్తి' గీమె 'నిర్మల' ఈళ్ళుగూడ సచ్చిండ్రు పెద్ద పెద్దోళ్ల కొట్లాడంగ మనమేందే... ఇయ్యాల వుంటం రేపుసత్తం... ఆ సచ్చేదేదో మంచి పన్కిసస్తే మంచిగుంటది..."

దుర్గయ్యా సాయిలు సూపెట్టిన బొమ్మలు సూసిండు... జెరశేపు ఆలోశన జేశిండు. ఇగ వీడు తన మాట యినడనుకోని ఒక్కసారి సాయిలునిక్కి కిందికి మీదికెలి సూశి సర్రసర్ర గుడిశె బయట కొచ్చిండు.

పోశమ్మ గల్మకాడ నిలవడి సూస్తున్నది.

సాయిలు అక్కడిక్కడ పడ్డ కాయిదాలు, పుస్తకాలు సదిరి – తనశేతులున్న 'నిర్మల కృష్ణమూర్తి' బొమ్మలున్న పుస్తకాన్ని కూడ బల్లకుంట సదువుతావుండు దీపం ముంగట. ఇయ్యాలగాకున్న రేపన్న తన అయ్యా తనపని మంచిదే అంటడన్న బరోసతో.

---

## 'ఎర్రసేన కుటీరం'

### చైనీస్ మూలం- వై చిన్‌యుంగ్

### స్వేచ్ఛానువాదం - ఉదయ్‌కుమార్

1942 ఆకురాలుకాలంలో ఒకరోజు పొద్దుటే, 'టాకూ దీవిలోవున్న ఆయుధాగారానికి బుల్లెట్లు తీసుకువెళ్ళమని' నాకో ఉత్తర్వు వచ్చింది. పదిహేను కిలో గ్రాముల బుల్లెట్లు తీసుకు బయలుదేరాను. జపాన్ వాళ్ళ చేతుల్లోవున్న 'వాగ్‌చై' ప్రాంతానికి చేరగానే, జపాన్ రహస్య పోలీసులకి నాయకత్వం వహిస్తున్న 'బంగారుపళ్ళు' గాడు డజనుమంది మనుష్యుల్తో నా వెనక పడ్డాడు.

ఈ ప్రాంతాల భూస్వామికి వీడొక్కడే కొడుకు. పుట్టినప్పుడే వీడికి రెండు పసుప్పచ్చరంగు పళ్ళు బైటికి పొడుచుకు వచ్చి వుండటం చేత 'బంగారుపళ్ళు' అంటూ మురిసిపోయాట్ట వీడితండ్రి. దాంతో వీడికి మారుపేరు వచ్చింది.

ముళ్ళ పొదల్లోంచి తప్పించుకొంటూ, దాక్కొంటూ దాగుడు మూతలాడి చివరికి వాళ్ళబారినుండి బయటపడ్డాను. కాస్త ఊపిరికూడ తీసుకోవటానికి ఆగి, మొహంమీది చెమట తుడిచేసుకొని తూటాలమూట వీపుమీద సరిగ్గా సర్దుకొని, ఉత్తరంగా వున్న విశాలమైన బంజరు భూమిలోకి సాగిపోయాను.

కొండల్లో పుట్టి పెరిగిన వాణ్ణవటంచేత ఇంతకు ముందెప్పుడూ ఇంత పెద్ద అంతూ పొంతూలేని బంజరునేల చూళ్ళేదు నేను. నడిచాను నడిచాను గానీ, ఒక్క ప్రాణిగానీ ఒక్క గ్రామంగానీ కనపళ్ళేదు. ఈ ఎడారి ఇసకనేలలో వున్న చెట్లల్లా వొక్క ముళ్ళ తుప్పలు మాత్రమే.

పొద్దెక్కేకొద్దీ వాతావరణం వుడుకెత్తిపోతోంది. వీస్తున్న వేడిగాలి మాడ్చేస్తూంది. ఇసక నేల నా కాళ్ళని కాల్చేస్తూంది. మొత్తం ఆప్రదేశమంతా ఓ పెద్ద గాడిపొయ్యిలా వుంది. ఒకటే చెమటలు పట్టి అలిసిపోయాను. ఎండిపోయిన నాలిక కనీసం పగిలిన పెదాల్ని తడపలేకపోతోంది. గొంతంతా మండిపోతోంది. ఎక్కడా ఒక్క చిన్న కాలవగానీ, కుంటగానీ, నుయ్యిగానీ లేదు. 'టాకూ దీవిలో నీళ్ళు బంగారంకంటె విలువైనవి' అనే 'పోహాయ్' సముద్ర తీరంలోని మా కామ్రేడ్ల మాటలు నాకిప్పుడర్థమయ్యాయి.

మా ప్లాటూన్ లీడర్ 'టియెన్' నా కొాక ఫ్లాస్కు నిండా మంచినీళ్ళిచ్చాడు గాని 'ఎందుకొచ్చిన బరువులే' అనే వుద్దేశంతో అతనికి తెలియకుండా దాన్ని వది లేశాను. ఇప్పుడెంత విచారించి మాత్రం ఏం లాభం? యుద్ధరంగం నించీ, హాస్పిటల్ నించీ, ఆయుధాగారంనించీ, తీరప్రాంతాలనించీ వచ్చేవాళ్ళకి మంచినీళ్ళు సరఫరా చేయటానికి ఇక్కడెవరైనా వుంటే ఎంత బాగుండును అని అనుకున్నాను.

మధ్యాహ్నం మరీ వూపిరాడకుండావుంది. ఎంతో కష్టంమీద వూపిరి పీల్చుకో గలుగు తున్నాను. వాంతులయ్యి తలతిరిగి అకస్మాత్తుగా కిందపడిపోయాను.

అప్పుడో కల. అన్నిరకాల పళ్ళతో నిండివున్న ఒక చెట్లతోపులో నేనున్నట్లని పించింది. స్వచ్ఛమైన కాలువలు చెట్లగుండా పారుతున్నాయి. వాటి వెనక నించి మా అక్క నడిచివస్తోంది. అరె! ఆమెని జపాన్ వాళ్లు చంపేయలేదా? ఇక్కడేం చేస్తోంది: పళిగెత్తి ఆమె చేతుల్లో దూకి అరిచాను,

"నాకు దాహంగా వుంది"

"తాగు. ఇవి తియ్యటి నీళ్లు"

నేను దోసిళ్లతో ఆత్రంగా తాగేశాను. చెప్పలేనంత హాయిగావుంది.

నెమ్మదిగా కుదుటపడి కళ్లు తెరచి చూచాను.

"ఇంకొంచెం తాగు. ఇవి తియ్యటి నీళ్లు" అనునయంగా అంటోంది ఎవరో పూర్తిగా అపరిచితురాలైన స్త్రీ.

చేతిలో గరిటె కూజాలోపెట్టి, తన గడ్డి టోపీతో విసురుతూ "బాగుంది కదూ మరిదీ?" అని కంగారుగా అడిగింది. నేను తలూపాను.

కాస్సేపటి తర్వాత ఆవిణ్ణి పరిశీలించడం మొదలు పెట్టాను. సుమారుగా ముప్పయ్యయిదేళ్లుంటాయి. ఎత్తుగావుంది. దట్టమైన కనుబొమలకింద పెద్ద పెద్ద కళ్లు. పీలికలైన బట్టలు కురచగా వదులుగా వున్నాయి. పూర్తిగా పల్లె యువతిలా వుంది. ఊరూ పేరూ అడుగుదామనుకొనేంతలో "నీ వయస్సెంత? నీ పేరేమిటి?" అని ఆవిడే అడిగింది ముందుగా.

"పదిహేడేళ్ళు. మా యింటిపేరు లీ. చిన్నిలీ అని పిలు చాలు"

"టాకూదీవి కెళ్ళటం ఇదే మొదటి సారా?"

నేను నివ్వెర పోయాను. ఆవిడ నా ప్రాణాలు కాపాడినప్పటికీ, ఇది ఎంతో రహస్యమైన విషయం కాబట్టి ఆవిడకి చెప్పలేను. నిలబడి బట్టలు దులుపుకొంటు న్నట్టు నటిస్తూ చీటీ కుట్టివున్న భాగాన్ని చూశాను వుందాలేదా అని. అక్కడేవుంది.

"కాదు. నేను టాకూదీవికి పోవటం లేదు. 'యుంగన్' లోని సంతకి పోతూంటే దారి తప్పాను" అబద్ధమాడేశాను!

మొహం గంభీరంగా పెట్టటానికి ప్రయత్నిస్తోంది ఆవిడ. కనురెప్పలు రెప రెప లాడిస్తూ నావేపు చూస్తూ "మనిషికి ఏమున్నా బాధ్యతుండేగా! ఈ అడివి గుండా దాటుతున్నప్పుడు నీకు తప్పకుండా తెచ్చుకోవాలని చెప్పొద్దూ నీకు?" అంది.

నేను దిగ్భ్రమతో కిక్కురుమనకుండా చతికిల పడ్డాను.

"నేను తిడుతున్నది నిన్ను కాదు చిన్నిలీ! మీ ప్లాటూన్ లీడర్ని. మనిషికి ముప్ఫయ్యయిదేళ్ళు దాటి వచ్చినయ్ గదా, అంత తెలివి తక్కువగా ఏమీ జాగ్రత్తలు చెప్పకుండా నిన్ను పంపటమేమిటి?" అంది దయగా.

ఎంత విచిత్రం! ఈవిడకి మాగురించి ఇదంతా ఎలా తెలుసు? నేనీవిడతో

రహస్యాలేవీ లేకుండ మనసు విప్పి మాట్లాడెయ్యొచ్చునా? ఉహూఁ! ముందసలు ఈవిడ సంగతేమిటో పూర్తిగా కనిపెట్టాలి.

"వదినా! నువ్వు......?" అని నేను కావాలనే ఆపేశాను.

ఆవిడ ముసిముసి నవ్వులు నవ్వింది. "అవును నేన్నీకు వదినెనే. అది పూర్తిగా నిజం" అంది.

నా మొహం ఎర్రబడింది. ఈవిడ గురించి ఏ ఆధారమూ దొరికేట్టు లేదు!

నా ఎర్రబడిన మొహం చూసినవ్వుతూ, తనని తను తమాయించుకోవటానికీ పెదాల్నినొక్కి పెట్టింది, "క్షమించు! నువ్వు మాలో వొకడవే అని తెలియగానే నన్ను నేను ఆపుకోలేక పోయాను" అంది.

నిర్ఘాంతపోయి ఆవిడవంక చూస్తున్నాను.

"ఈ సంచి మీ ప్లాటూన్ లీడర్ టియెన్‌ది కాదూ?' ఆవిడ సూటిగా అడిగేసింది. "ఈ మూడు పెద్ద మాసికల్నిబట్టి గుర్తుపట్టాను." అని ముక్కోణాకారంగా మడిచిన చీటీ చూపుతూ "నాకు వుత్తరం కూడా అందిందిలే" అంది.

ఆవిడ మా ప్లాటూన్ లీడరు భార్య అని అప్పుడు నా బుర్రకి తట్టింది. "టాషువాంగ్ వదినా!'' అంటూ ఉత్సాహోద్రేకంతో కేక వేశాను.

ఆవిణ్ణి గురించి నేనెంతో విన్నాను. ఆవిడ ఎంతో దృఢమైన వ్యక్తిత్వం గలది. అవిణ్ణి చంపటం తేలికేమోగానీ లొంగదియ్యటం మాత్రం తేలిక్కాదు. తన తొమ్మిదో యేటనే భూస్వామి ఇంటికి పని పిల్లగా వెళ్ళాల్సి వచ్చింది. అయినా ఆవిడ భూస్వామి భార్య తన పాదాలు బిగించటానికి వొప్పుకోలేదు*. పదిహేడేళ్ళ వయస్సులో ఆవిడ కమ్యూనిస్టుల్లో కలిసి భూస్వామి ధాన్యపుకొట్టుకి నిప్పంటించి, ఈ అడివిలోకి తప్పించుకొని, ఇక్కడి స్త్రీ సంఘానికి నాయకురాలయింది. కాపలా కాయటంలో గానీ, గస్తీ తిరగటంలోగానీ, మందుపాతర్లు నాటటంలోగానీ, శత్రువుల అచూకీ లాగటంలోగానీ ఎంతో మంది మగాళ్ళకంటేకూడా ఆవిడ నేర్పరి అంటారు. కిందటేడు శత్రువులు దాడిచేసిన సమయంలో, చేతిలో పార తప్ప వేరే ఆయుధమేమీ లేకపోయినా ఆవిడొక ద్రోహిని ఎలా బంధించిందో అందరికీ తెల్సినదే. నేని పనిమీద బయల్దేరే ముందే ప్లాటూన్ లీడర్ ఆవిడకో ఉత్తరం రాశాడు. నాక్కూడా అవిణ్ణి చూడాలని ఎప్పట్నుంచో చాలా కుతూహలంగా వుంది.

"క్షమించు చిన్నలీ! నేనంటున్నదేమిటంటే మీ ప్లాటూన్ లీడర్ మరీ నిర్లక్ష్యంగా వున్నాడూ అని. జపాన్ వాళ్ళూ, ద్రోహులూ ఈ జిల్లా అంతటా పిచ్చికుక్కల్లా తిరుగుతున్నారు. అయినా అతను నీకు దారి చెప్పకుండా నీళ్ల తెచ్చుకోమని చెప్పకుండా పంపాడు."

---

*చైనాలో పాదాలు బిగించటం సౌందర్యం దృష్ట్యా ఆడవాళ్ళకి ఆచారం.

నేను నీళ్ల తెచ్చుకోక పోవటంలో మా ప్లాటూన్ లీడర్ తప్పేమీ లేదని వివరించాను. నేను చెప్పింది విని ఆవిడ సంతోషించింది.

"ఇవ్వాళ జిల్లా మీటింగ్‌కి వెళ్లి తిరిగివస్తూ కొన్నిమూలికలు ఏరుకుంటూ వస్తున్నాను. నువ్వేమో దాదాపు ప్రాణం పోయినట్టు పడివున్నావు. మా కుటీరానికి వచ్చి కాస్సేపు విశ్రాంతి తీసుకో" దయగా అంది.

ముళ్ల పొదల గుండా తూర్పుగా నడిచి అట్టే ఎత్తులేని, గడ్డితో నేసిన మూడు గదుల చిన్న కుటీరానికి వచ్చాము. ముందు వాకిలంతా కంపతో వేసిన దడి వుంది. వెనక వంటచెరకూ, ఎండుగడ్డీ నిలవచేసి వున్నాయి. తూర్పుదిశగా దట్టమైన ముళ్ళ పొదలున్నాయి. దూలాలూ, తలుపులూ, కిటికీలూ, మంచాలూ అన్నీ ఆ ముళ్ళ చెట్ల కలపతో చేసినవే. ముందు తలుపు దగ్గర నీటి బాన పక్కగా పేముతో అల్లిన గంప వుంది. దాని నిండా గిన్నెలూ, సాసర్లూ, కర్రపుల్లలూ* వున్నాయి. మొత్తం అంతా చూస్తోంటే, పేదతనం మూలంగా ఒక కుటుంబం ఈ నిర్జన ప్రదేశంలో నివశించాల్సి వస్తోంది అని అనిపించేట్లుగా వుంది. టాషువాంగ్ వదిన తమ స్వగ్రామం 'చింగ్‌లిన్' ఉత్తరంగా పదిహేను కిలోమీటర్ల దూరంలో 'సియావోకు' దీవి మీద వుందని చెప్పింది.

రెండు నెలల క్రితం గ్రామపార్టీశాఖ సెక్రటరీ రైతుసంఘ అధ్యక్షుడూ అయిన 'చాంగ్' బాబాయి కొందరు మిలిషియా మనుష్యుల్ని తీసుకొచ్చి ఈ కుటీరమూ, కర్రసామగ్రీ తయారుచేయించి, కొంత ధాన్యం కూడా నిలవుంచి ఈవిడ ఇక్కడ స్థిరపడేలా చేశాడట. ఎర్రసైనికులకి మంచినీళ్ళు అందించటమూ, వాళ్ళు తెచ్చుకున్న భోజనం వేడిచేసి పెట్టటమూ ఆవిడ పనులు. యుద్ధరంగంనించీ, ఆసుపత్రి నించీ, టాకూదీవిలోని ఇతర యూనిట్లనించీ, ఎర్రసైనికులు తరచుగా ఈ మార్గం గుండా వెళ్తూ విశ్రాంతి కోసం ఇక్కడ ఆగుతుంటారు. ఈ విశ్రామస్థలం, యుద్ధరంగం నించి టాకూదీవిలోవున్న హాస్పిటల్‌కి పంపబడే గాయపడిన సైనికులకి మరీ ముఖ్యంగా అవసరం. ఎందుకంటే వాళ్లకి పుడుకునీళ్లూ, వేడివేడి ఆహారమూ కావాలి. దానితో క్రమంగా దీనికి 'ఎర్రసేన కుటీరం' అన్న పేరొచ్చింది.

ఇలా కబుర్లు చెప్తూనే ఆవిడ నా కోసం వంట చేసేస్తోంది. జొన్నలకి ఏవో దుంపలు కలిపి కుండలో సగం వరకూ తీసుకొని కడిగి సూప్ వండటం కోసం పొయ్యి మీద పడేసింది.

సరిగ్గా అప్పుడు పన్నెండు పదమూడేళ్ళ కుర్రాడొకడు రెండు బకెట్ల నిండా నీళ్ళు మోసుకొస్తున్నాడు అటూ ఇటూ వూగుతూ. ఆవిడ గబగబా ఎదురువెళ్ళి బకెట్లందుకొని నెమ్మదిగా బాధగా "ఒక్కసారి చూసుకో నీవంక నువ్వు ఎప్పుడూ

---

*చైనాలో ప్రజలు రెండేసి కర్రపుల్లలతో చెంచాలతో లాగానే ఆహారం తింటారు.

నేను చెప్పినట్టు వినవుకదా ! నీ వయసు కుర్రాడు సగం సగం రెండు బకెట్లు మోసేచాలు. మళ్లీ ఇంకోసారి గానీ ఇలా అంచుల నిండా మోసుకొచ్చావంటె ఇంకెప్పుడూ నీళ్లకి పంపను నిన్ను" అంటూ, ఆ బకెట్లలో నీటిని బానలోకి వంపేసి, ప్రేమగా కుర్రాడి మొహం తుడిచింది. నన్ను చూపిస్తూ "టియెన్ షెంగ్! ఇతను నీ బాబాయి. మీ నాన్న దగ్గర్నించి వస్తున్నాడు. నీ వయసు కుర్రాడికి పెద్దాళ్ళని ఎలా పలకరించాలో తెలియద్దూ ?" అంది.

విశాలమైన కళ్లతో నా వంక చూసి టియెన్ షెంగ్ పలకరింపుగా నవ్వాడు. వాడు దిట్టంగా అచ్చు వాళ్ల నాన్నలాగే వున్నాడు. నా చుట్టూ చేతులుచుట్టి, తననీ వాళ్లనాన్న దగ్గరికి తీసుకెళ్లమనీ, తనుకూడా ఎర్రసైన్యంలో చేరతాననీ బతిమాలాడు.

"బాబాయిని విసిగించకు టియెన్ షెంగ్, కాస్సేపు విశ్రాంతి తీసుకోనీ ... ఆకలివేస్తోందా?'' అని అడిగింది టాషువాంగ్.

"లేదుగానీ దాహమేస్తోంది" అని కూజా ఎత్తి తాగటం మొదలు పెట్టాడు. నేను అదిరిపోయాను. ఎందుకంటే వాళ్లమ్మ ఇప్పుడే ఆ నీటితో దుంపలవీ కడిగింది.

"తాగకు! ఆగు!" నేను వారించబోయాను.

"ఫరేం ఫరవాలేదు. బురద తేరుకుందిలే. చూడు! ఎంత సంతోషంగా తాగుతున్నాడో" అంది టాషువాంగ్.

నిజమే! వాడొక్క గుక్కలోనే సగంకూజా మింగేశాడు. కానీ నాకెందుకో బాధగా అనిపించింది. రెండు బకెట్ల మంచినీళ్లు చెమటలు కారేలా మోసుకొచ్చిన వాడు తాగాల్సిందీ మురికినీళ్లా? ఇక్కడకి పదికిలో మీటర్లలోపులో ఎక్కడా మంచినీళ్లు దొరకవని ప్లాటూన్ లీడర్ టియెన్ ఒకసారి చెప్పిన విషయం అకస్మాత్తుగా నాకు జ్ఞాపకం వచ్చింది. మరి నీళ్లకోసం అతనెక్కడికి వెళ్లి వుంటాడు?

టియెన్ షెంగ్ అక్కడి ప్రజలు పాడుకొనే పాట వొకటి వినిపించాడు.

"ఉప్పు నీటి కోసం నూతులు తవ్వితె
తవ్వి తవ్వి పారలు పాడై పోతయ్.
పాతనది నీళ్లు ఎంతో మధురం
వీటి కంటె విలువా బంగారం ?"

సముద్ర తీరానికి దగ్గరగా వుండటంవల్ల ఇక్కడ బావుల నీళ్లు ఉప్పగా వుంటాయి. కానీ ఈ పాతనది ప్రత్యేకత ఏమిటా అని ఆశ్చర్యపడ్డాము.

"ఆ నది ఎప్పుడో సంవత్సరాల కిందే ఎండిపోయింది. మేం నదిమీద గోతులు తవ్వితే అవి నెమ్మదిగా బురద నీటితో నిండుతాయి. బురద అడుక్కిపోగానే ఆ నీటిని తోడుకుంటాం" అని వివరించింది టాషువాంగ్ వదిన.

"ఆ నది ఎంత దూరం వుంటుంది ఇక్కడకి ?"

"పన్నెండున్నర కిలోమీటర్లు" జియెన్ షెంగ్ చెప్పాడు.

"పన్నెండున్నరా ?" నేను నమ్మశక్యం కాక పెద్దకేక వేశాను. "అంత కంటే దగ్గరేదీ లేదా?"

టాషువాంగ్ వదిన నవ్వి లేదన్నట్టు తలవూపింది. రానూపోనూ కలుపు కొని మొత్తం ఇరవై అయిదు కిలో మీటర్లు. ఒక కుర్రాడు మహాఅయితే ఒక్క సారి వెళ్లిరావటం కూడా ఎంతోకష్టం. వాళ్ల అమ్మ పగలు వచ్చిపోయే సైనికుల అవసరాలు చూసి సాయంత్రం వెళ్తుందేమో నీళ్లకోసం. నాకు గుండె కోసినంత బాధగా అనిపించింది. కేవలం పదిహేను కిలో గ్రాములు మోస్తూ ఇరవై అయిదు కిలోమీటర్లు నడిచే సరికే నా పనయిపోయింది ఇవ్వాళ ఉదయం. ప్రతి రోజూ ఇంత శ్రమ చేయాలంటే ఎంత దృఢనిశ్చయం ఎంత పట్టుదల వుండాలి !

"మొదట్లో కొంచెం కష్టంగానే వుండేది" టాషువాంగ్ వదిన వొప్పుకొంది. "కానీ నేను చేస్తున్న ఈ కొద్దిపని జపాన్‌పందుల తద్దినం కోసమేనని గుర్తుకు రాగానే నా అలసటంతా ఎగిరిపోయేది. తరవాత్తరవాత అలవాటైపోయింది. ఇప్పుడైతే నాకదేమీ లెక్కకాదు" అంది.

"అమ్మ నన్ను, మన సైనికులు యుద్ధరంగంలో ఎలా రక్తాలు ధారపోస్తారో ఆలోచించమంటుంది. అప్పుడు నా కన్నులు ఏమీ కష్టం అనిపించదు" జియెన్ షెంగ్ అన్నాడు.

వాళ్ల ఆత్మస్థైర్యం నాకు నూతనోత్తేజాన్నిచ్చింది. పడవకి తెలితే శక్తి వస్తుంది. మనిషికి గుండెనిండి శక్తివస్తుంది. నీ హృదయాన్ని విప్లవాని కంకితమియ్యి. నీకు చెదిరిపోని కరిగిపోని గుండెబలం వస్తుంది.

టాషువాంగ్ వదిన భోజనం వడ్డించింది. కేవలం జొన్నలూ ఏవో దుంపలే అయినా ఎంతో మధురంగావుంది.

భోజనం పూర్తయిన తర్వాత ఆవిడ నాకు కొన్ని వనమూలికల పొట్లాలు అందిస్తూ "వీటిని హాస్పిటల్‌కి తీసుకువెళ్లు. అక్కడ కొరతగావున్న మందుల బదులివి పనికొస్తాయి. డాక్టర్లు ఈ వేళ్లూ బెరడూ చాలా గుణాన్నిస్తాయంటారు" అంది. తర్వాత ఏవి బాధని తగ్గిస్తాయో, ఏవి రక్తస్రావాన్ని ఆపుతాయో, ఏవి జీర్ణానికి పనికివస్తాయో, ఏవి రక్తప్రసరణ అధికం చేస్తాయో వివరించింది.

నేను శలవు తీసుకొంటుండగా, ఉత్తరంగా సుమారు ఏడుకిలోమీటర్లు విస్తరించివున్న ఆ ముళ్ల పొదలగుండా పోతే, దారి తప్పటం చాలా సులభమనీ, కాబట్టి దారిలో బెరడు చెక్కేసిన చెట్లు ఎదురవ్వగానే పక్కకి తిరగాలని చెప్పింది. బెరడు కుడిపక్క చెక్కివుంటే కుడివైపుకి, ఎడమపక్క చెక్కివుంటే ఎడమవైపుకి తిరగాలని గుర్తుంచుకొమ్మని చెప్పింది. దానికి జవాబుగా నేను, శత్రువు ఈ ఆకురాల

కాలంలో మరిన్ని దాడులు జరపదలచుకొన్నాడు కాబట్టి మరింత సిద్ధంగా జాగ్రత్తగా వుండాలని హెచ్చరించాను. "తుఫానుకిముందు కలుగుల్లోంచి బైటపడుతాయి పాములు, ముళ్లపొదల్లో ఈ మధ్య చాలమంది రహస్య ఏజెంట్లు కనిపించారు. కాబట్టి జాగ్రత్త" అని అందావిడ.

రోజు రోజూ ఆదారెమ్మట సాగిపోయే క్షతగాత్రుల క్షేమం కోసం టామువాంగ్ వదిన తన శక్తిమేరకు అన్ని యేర్పాట్లూ చేస్తుంది.

## 2

రెండవసారి ఎర్రసేన కుటీరానికి వెళ్లినప్పుడు నాకు దారితెలుసు. నేనీసారి మరో పనిమీద టాకూ దీవికి వెళ్ళాల్సి వచ్చింది. ఇంతకుముందు లాగానే ప్లాటూన్ లీడర్ నా దగ్గరకు వచ్చాడు జాగ్రత్తలు చెప్పటానికి. "నువ్వీసారి స్ట్రెచర్లమీది ఇద్దరు గాయపడిన సైనికులకి రక్షణగా శతృవులు ముట్టడించిన మూడు ప్రాంతాల గుండా వెళ్ళాలి. సుమారు వందకిలోమీటర్లకంటె ఎక్కువ ప్రయాణం. అంత సులభమైన పనేమీ కాదు సుమా!"

ప్లాటూన్ లీడర్! మీరేమీ గాభరా పడకండి" అంటూ నా లక్ష్యాన్ని నేను చేరుకుంటానని ఆయనకి గట్టి హామీ ఇచ్చాను. ఈ మార్గంగుండా పోవటానికి నే నెలాంటి ప్లాను వేశానో ఆయనకి చెప్పాను. మేము ఆగస్టు ఇరవై అయిదున చీకటి పడీపడగానే బయలుదేరి, రెండు ఉదయాల తర్వాత ఈ తుప్పల అడవిలోకి ప్రవేశించాం.

ఊహించని కష్టం ఎదురైంది ఇప్పుడు మాకు. శతృవులు ఆక్రమించిన ప్రాంతాల్ని దాటడానికి చాలా సమయం పట్టడం చేత మా దగ్గరున్న మంచినీళ్లన్నీ ఖర్చైపోయాయి. ఏం చేయాలిప్పుడు? మా ఆశలన్నీ ముందున్న ఎర్రసేన కుటీరం మీద నిలిచాయి. కుటీరంసుమారు ఒక కిలోమీటరు దూరంలో వున్నప్పుడు హఠాత్తుగా ఒకపొదలోంచి టియన్ షెన్ దూసుకొచ్చాడు. ఆ రోజు పొద్దుట ఒక అనుమానాస్పదమైన వ్యక్తి, దాదాపురహస్య ఏజెంటులా వున్నవ్యక్తి తమ కుటీరానికి వచ్చాడట. వాళ్లమ్మ దారెమ్మట పోయే ప్రయాణీకుల్ని హెచ్చరించమని వీడినిక్కడికి పంపిందట. టియెన్ షెన్ వాడెలావుంటాడో వర్ణించాడు. అది 'బంగారుపళ్ల'గాడికి ఖచ్చితంగా సరిపోయింది. అన్నిటికంటెముందు ఆ పంది వెధవగాడి పీడ వదిలించటం మంచిది. పిస్టల్ బైటికి లాగి "నాతోరా!" అన్నాను టియెన్ షెన్‌తో.

"లీ బాబాయ్! వాడు వంటరిగా వచ్చివుండడు అని చెప్పమంది అమ్మ. వాడి మనుషులు ఎక్కడో చెట్లలో దాక్కొని వుండాలి. ప్రమాదకరమైన పనులేవీ చెయ్యొద్దంది. అయినా నువ్వేమీ విచారపడనక్కర్లేదు. నేనింటికి వెళ్లి అన్నమూ నీళ్లూ తీసుకొస్తాను.

"వద్దు. శతృవులు చూస్తుండగా నీళ్ల తీసుకు రావటం చాలా ప్రమాదం" నేను అభ్యంతరం చెప్పాను. స్ట్రెచర్లని దట్టమైన చెట్ల గుబురులో దాచి, జాగ్

త్తగా కుటీరం దగ్గరికి పాక్కొంటూ వెళ్లాను. కుటీరానికి తూర్పుగా వున్న ముళ్ల పొదల వెనక దాక్కొని నెమ్మదిగా కొమ్మల్ని తొలగించి చూశాను. పేముబల్లమీద బాసింపట్టువేసి కూర్చొనివున్నాడు 'బంగారుపళ్ళ' గాడు. పైప్‌కాలుస్తూ, చిన్నిచిన్ని చీకిరికళ్ళతో చుట్టూరా పరిశీలనగా చూస్తున్నాడు. వాడికి ఎదురుగా కూర్చొని టాషువాంగ్ వదిన కాదలనించి చిక్కుడుగింజలు వలుస్తోంది. వాడి ఎత్తులకి పైఎత్తులెలా వెయ్యాలో అని ఆలోచిస్తున్నట్లుగా ఆవిడ కనుబొమలు ముడతబడి వున్నాయి.

"కాస్త దయ చూపించవమ్మా మరదలా! నీకు పుణ్యం వుంటుంది గానీ కాస్త తాగాటానికి నీళ్ళియ్యవమ్మా! మనిద్దరమూ ఒకే పడవ ప్రయాణీకులం-ఇద్దరమూ పేదాళ్ళమేనాయె. ఈ కష్టకాలంలో ఇక్కణ్ణించిక మకాం ఎత్తెయ్యాల్సి వుంటుందనుకొంటున్నాను. ఈ చుట్టు పట్లెక్కడా నీటిజాడ వున్నట్టనిపించదు. ఏదో కాస్త గొంతు తడుపుకోని తల్లీ." అని బతిమాలుతున్నాడు, 'బంగారుపళ్ళ' గాడు.

"ఆ ముక్కే పట్టుకు వేళ్ళాడతావేమిటి? ఈ చుట్టుపట్లెక్కడా నీళ్ళులేవని నీకూ తెలిసినప్పుడు మా ఇంట్లోవున్న నీళ్ళుకాసిన్ని నీ యెదాన పొయ్యమని గొడవ చేస్తావెందుకు? అవి కాస్తా నువ్వు తాగేస్తే నేనేం చెయ్యాలి?" ఆవిడ అసహనంగా అంది.

'ఈ తొత్తువెధవ ఇంత దయనీయంగా నటిస్తున్నాడెందుకబ్బా? ఈ నిర్జన ప్రాంతాలకి వీడు తన మనుషుల్నెందుకు తెచ్చినట్టు? ముందు టాషువాంగ్ వదినని లొంగదీసుకొని ఆవిడద్వారా మా వాళ్ళని పట్టుకోవాలనా? లేకపోతే తర్వాతి "ముట్టడి" కోసం, ఈ లోపలే మంచినీటిజాడ కనిపెట్టాలనా? రెండింటి కోసమూ అయుండొచ్చు. ఈ వెధవ ఇక్కడ తగలడితే నీళ్ళెలా సంపాదించను. గాయపడిన కామ్రేడ్లు మందేసుకోవాలి, స్ట్రెచర్ మోసేవాళ్ళు నలుగురికీ పిండిలో కలుపుకోవటానికి కూడా నీళ్ళు కావాలి.' ఏం చెయ్యాలో అర్థంకాక సందిగ్ధంలో పడ్డాను.

సరిగ్గా అప్పుడు టియెన్‌షెన్ నడుచుకుంటూ వస్తున్నాడు పడమటినుంచి. "అమ్మా! ఆకలే. చచ్చిపోతున్నానే. ఎసరుపెట్టి అన్నం వండెయ్యరాదే అమ్మా" అని కేకలు పెట్టాడు.

''ఇప్పుడే చేసేస్తానురా బాబూ!'' అంటూ లేచి లోపలికి వెళ్ళింది.

టియెన్‌షెన్ 'బంగారుపళ్ళ' గాడు చూడని సమయం కనిపెట్టి ఏడుగురు వచ్చారంటూ సైగ చేశాడు తల్లికి. ఆవిడ గిన్నెలోకి నీళ్ళువంపటం వినపడింది.

'బంగారుపళ్ళ' గాడు తలుపు దగ్గరకొచ్చి ''మీరిక్కడ చాలా సుఖంగా వున్నట్టు కనిపిస్తున్నారు. నువ్వు ప్రతీ రాత్రీ చాలా నీళ్ళు మోసుకొస్తావని విన్నాను, అన్ని తాగేయగలుగుతారా మీరు?" అని మొరిగాడు.

''నీక్కూడా వాసన కనిపెట్టే శక్తివుందే! ఇంతకు ముందే [illegible]

ఈ మధ్యే ఇక్కడకు వచ్చానని, మరి నేను ప్రతీ రాత్రీ నీళ్ళు మోసుకొస్తానని ఎలా తెలుసుకున్నావు?''

''ఇందాక ఎవరో చెప్పార్లే''.

''ఎవడా గాడిదకొడుకు ఈ కథల్లుతోంది? నే వెళ్ళి వాడిక్కాస్త నాతల కాయి ఇస్తాను.''

''అవసరం లేదు. అది సరే గానీ ఈ చుట్టుప్రక్కల అతి దగ్గర్లో నీళ్ళెక్కడున్నాయో నీకు తెలిసే వుండాలి. ఏమంటావు?''

''ఖర్మ ! చూస్తుంటే ఎక్కడా కాసింత మనశ్శాంతి దొరికేటట్టులేదు. సరే ! నన్నెవరు పీడించదలుచుకున్నా లక్ష్యపెట్టను. నాకు మనుష్యులన్నా భయంలేదు పిశాచాలన్నా భయంలేదు''

'బంగారుపళ్ళు' గాడు ఇకిలించాడు. ''ఆ...ఆఁ ! కోపం తెచ్చుకోమాకు. నా కన్నులు బుద్ధిలేదు. జరిగిందంతా మర్చిపో. సమయం వచ్చినప్పుడు నా గురించి నీకు బాగా అర్థమవుతుందిలే'' అన్నాడు.

ఏమిటీ వెధవ ఉద్దేశ్యం ? వాణ్ణి చంపెయ్యాలని నా కెంతగానో అనిపించింది. ఇంతలో పొయ్యిలో పుల్లల కోసం టూషువాంగ్ వదిన బైటికివచ్చింది. 'బంగారుపళ్ళ' గాడి వీపు నాకేసి వుండటం చేత, ఆవిడ దృష్టిలో పడటం కోసం పైకి లేచాను. ఆవిడ నన్నుచూసి ఆనందంతో ఆశ్చర్యపోయింది. పీకె కోసెయ్యనా ? అన్నట్టు సైగచేశాను. కానీ ఆవిడ తీవ్రంగా చూసి నేను నా ప్రయత్నం మానుకొనేలా చేసింది.

''అమ్మా నీళ్ళు మరిగిపోయాయా? కడుపులో మండిపోతోంది'' బయటి కొస్తూ అరిచాడు టియెన్‌షెన్.

''ఒక్క నిముషం ఆగు ! కదలకు. కాస్త చల్లబడు !'' మళ్ళీ కుటీరంలోకి వెళ్తూ ఆవిడ గట్టిగా అంది. ఈ హెచ్చరికలన్నీ స్పష్టంగా నా కోసమే.

ఆవిడ గొంతు వినపడింది. ''టియెన్‌షెన్! అలా ఉత్తరం వేపు వెళ్ళి కాస్త చాంగ్ మామయ్య వస్తున్నాడేమో చూసిరా బాబూ ! బానలు కొనటానికి సంతకి వెళ్ళాడు కదా, ఈ పాటికి తిరిగివస్తుండాలి'' అంది.

నేను కిందటి పర్యాయం వచ్చినప్పుడు చాంగ్ బాబాయి అన్నాడు; శత్రు దురాక్రమణ ప్రారంభం కాకముందే నదిమీది నీటి గుంటలన్నీ కప్పెయ్యాలి అని. ఆ గుంటలన్నీ కప్పేసినా, ఎర్రసేన కుటీరం తన పని తాను యథావిధిగా కొనసాగించాలంటే అది కొంత నీటిని నిలవచేసుకోవాల్సి వుంటుంది. దానికోసమే గ్రామస్థులు పెద్దబానలు పది సేకరించారు. బహుశా వాళ్ళు వాటినివ్వాళ తెస్తూండి వుండవచ్చు.

టియెన్‌షెన్ కొంతదూరం పరుగెత్తి ఎత్తైన ముళ్ళచెట్టు ఎక్కి దాన్ని ఊపుతూ కేకలేశాడు. 'బంగారుపళ్ళు' గాడు చటుక్కున లేచి నిలబడి, కుడిచెయ్యి

జేబులో దోపి, జాగ్రత్తగా అటూ ఇటూ చూసుకొంటూ కుర్రాడున్న చోటికి ఉరికాడు.

టాషువాంగ్ వదిన కుటీరంలోంచి బైటికి వచ్చి, వాడి వైపు అసహ్యంగా చూసి, వెంటనే ఒక మూతవున్న పెద్ద గంప తెచ్చింది. దాని నించి ఆవిర్లు పైకి లేస్తున్నాయి. దాన్ని గడ్డికుప్ప వెనక దాచి టియెన్‌షెన్‌ని కేకేసింది.

టియెన్‌షెన్ చెట్టుమీంచి దూకి పరుగెత్తుకొచ్చాడు. వెనకే 'బంగారుపళ్ళ' కూడా దొల్లుకొచ్చాడు.

''కనపడ్డారా ?'' టాషువాంగ్ వదిన అడిగింది.

''కనపడ్డారమ్మా. వాళ్ళతో పెద్ద బాసలు మోసుకొస్తున్నారు.''

గంప అచూకీ కనిపెట్టేశాడు 'బంగారుపళ్ళ' గాడు. తెల్లని టవల్ దానిమీద మూతగావేసి కట్టేసి పక్కకి తిరిగి గద్దిస్తూ ''ఎక్కడికి తీసుకెళ్తున్నారు దాన్ని ?'' అని అడిగాడు.

టాషువాంగ్ వదిన నిశ్శబ్దంగా వూరుకొంది. ఇక ఏదో వొకటి చెయ్యాలి అనుకొన్నాను కానీ ఆవిడ టియెన్‌షెన్‌ని పక్కకి తీసుకువెళ్ళి చెవిలో ఏదో చెప్పి, పైకి మాత్రం గట్టిగా 'దీన్ని వాళ్ళ దగ్గరికి తీసుకెళ్ళు' అంది.

గంపని నెత్తిమీద పెట్టుకొని, ముళ్ళ పొదలగుండా వెళ్ళిపోయాడు టియెన్‌షెన్. 'బంగారుపళ్ళ' గాడు వెనకే పోలీసు కుక్కలా నిశ్శబ్దంగా అనుసరించాడు.

వాళ్ళు బాగా దూరం వెళ్ళగానే టాషువాంగ్ వదిన గబగబా కుటీరంలోపలికి వెళ్ళి అన్నమూ, నీళ్ళూ తెచ్చి నాకిచ్చింది. ''చాలా సేపు అయ్యింది. క్షమించు'' అంది.

ఓహో ! అది 'బంగారుపళ్ళ' గాడి పీడ వదిలించుకోవటానికి వేసిన ఎత్తన్నమాట. ఆవిడ తెలివి తేటలకీ, సమయస్ఫూర్తికీ నాకు చాలా ఆనందం వేసింది.

''నువ్వేమీ కంగారుపడకు. ఆ బాసల్ని తెస్తున్న ఎర్రసైనికులు వీళ్ళ పని పట్టేస్తారు. మీరు భోంచేశాక పడ్డనిమిదో మార్గంలోకి తిరగండి. ఇంతకుముందు దానికంటే ఇది చాలా మంచిది''

నేను అన్నమూ నీళ్లూ పట్టుకొని మా వాళ్ళ దగ్గరకు వచ్చేశాను. మా భోజనాలు పూర్తయిన తర్వాత మాదారెమ్మట మేం వచ్చేశాం,

టాకూదీవికి వచ్చినంత వరకూ, ఆ తల్లీ కొడుకుల సంగతేమయిందోనని నేను చాలా ఆతృత పడ్డాను. కానీ నాకు శుభవార్తే ఎదురయింది. టియెన్‌షెన్ వాళ్ళందర్నీ జాగ్రత్తగా వలలోకి నడిపించుకు వెళ్ళాడట. అక్కడ మిలిషియా మనుషులు వాళ్లపని పట్టేశారట. కానీ 'బంగారు పళ్ళ' గాడు మాత్రం తప్పించుకొన్నాడట. అయినా ఈపాటికి వాడు దొరికిపోయే వుంటాడు.

## 3

సెప్టెంబర్‌లో, యుద్ధంలో తలమీద గాయమై చాలా రక్తంపోయి, కోమాలో పడిపోయాను. టాకూదీవిలోని హాస్పిటల్‌కు నన్ను మోసుకుపోతున్నారని మాత్రం అస్పష్టంగా తెలుస్తోంది.

ఏవో మాటలు వినబడి కళ్ళు తెరిచాను. టాఘువాంగ్ వదిన కనబడింది. అంటే ఎర్రసేన కుటీరంలో ఆగామన్నమాట. ఎర్రసేన కుటీరానికి మళ్ళీ రావటం చాలా సంతోషంగా వుంది నాకు.

ఆవిణ్ణి పరిశీలనగా చూశాను. జుట్టు ముడివేసిలేదు. వదులుగా పొట్టిగా కత్తిరించి వుంది. మనిషి కాస్త సన్నబడినా కళ్ళు మాత్రం ఎప్పటిలానే కాంతివంతంగా మెరిసిపోతున్నాయి. 'బంగారుపళ్ళు' గాడు వెంటాడిన నాటి నించీ, ఆవిడకి చాలా కష్టకాలం దాపురించిందని అర్థమైంది నాకు; అలసిన ఆవిడ కళ్ళని చూస్తూంటే.

ఉన్నట్టుండి ఆవిడ మొహం పాలిపోయింది. కళ్ళు మూసుకొని నీరసంగా గోడకి ఆనుకొంది.

"ఏమైంది టాఘువాంగ్ వదినా ?" అని కేకవేశాను అదుర్దాతో.

"నీ కోసం తన రక్తమిచ్చింది. మరేమీ ఫర్వాలేదులే! ఒక్క నిమిషంలో మామూలుగా అయిపోతుందావిడ" అన్నాడు నా వెంటే వచ్చిన డాక్టరు.

ఆవిడ రక్తం నా నరాల్లో పరుగెత్తుతోంది! తెలియకుండానే నా కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి.

ఇంతలో ఒక వార్త వచ్చింది. శత్రువు 'ముట్టడి పథకం' ప్రారంభం కావటంతో టాకూ దీవిలోని హాస్పిటల్‌ని అక్కడినించి తరలించేశారట. అందువల్ల నా ఆరోగ్యం చక్కబడేంత వరకూ, నేను ఎర్రసేన కుటీరంలోనే వుండాలని పార్టీ నిశ్చయించిందట.

శత్రువుల ఏజంట్లు తరుచుగా వచ్చి నీటి కోసం ముళ్ళకుప్పల్లో దేవులాడి పోతుండేవాళ్ళు.

శత్రువుల ముట్టడిని తిప్పికొట్టటానికి వచ్చే ఎర్ర సైనికులకి ఆహారమూ నీళ్ళూ అందించటం కోసమని, ఎర్రసేన కుటీరంలో ఐదుగురు మగవాళ్ళనీ ఎనిమిది మంది ఆడవాళ్ళనీ టాఘువాంగ్ వదిన చేతికింద నియమించారు.

ఒకరోజు సాయంత్రం ఆవిడ పార్టీ పుత్తర్వును కుటీరంలో వున్న పదిహేను మందికీ వివరించింది. "జపాన్‌వాళ్ళ ముట్టడి మొదలవుతోంది. వాళ్ళు మన ఆయుధాగారాన్నీ, ముద్రణాలయాన్నీ, హాస్పిటల్నీ నాశనం చెయ్యాలని చూస్తున్నారు. ఈసారి వాళ్ళు మన మీద మెరుపు దాడులు చెయ్యాలని ప్రయత్నిస్తున్నారు. మన రక్షణ బలాలు సరిపడాలేవు. ఈ అడవిలో వాళ్ళకి నీళ్ళూ తిండీ దొరకవు కాబట్టి,

విభాగం' నించి ఉత్తర్వు వచ్చింది. తర్వాత మన బలాలన్నిటినీ సేకరించి వాళ్ళని ఇక్కడి నించి పూర్తిగా తుడిచిపెట్టేస్తారు'' అంది.

నా మెదళ్ళో ఎన్నో సందేహాలు తలెత్తాయి. మేము ఎర్ర సైన్యానికి ఎలా నీళ్ళు సరఫరా చేయటం ? నీళ్ళు నిలవవుంచటానికి ఎన్నో బానలు కావాలి. అన్నిటిని ఎలా సంపాదించటం ? ఒకవేళ బానలూ, నీళ్ళూ సంపాదించినప్పటికీ ఎలా వాటిని దాయటం ? అంత శక్తివుందా మాకు ?

''కామ్రేడ్స్ ! ఎర్రసేన కుటీరానికిదొక పరీక్ష" టాషువాంగ్ వదిన మాటలు వినపడ్డాయి; నా సందేహాల్లోంచి. ''శత్రువుకి మనం ఒక్కచుక్క నీరన్నా చిక్కనివ్వకూడదు. మన ప్రాణాల్ని పణంగా పెట్టి అయినా సరే దాన్ని కాపాడి ఎర్ర సైన్యాని కందించాలి.''

''తప్పకుండా అలాగే చెయ్యాలి టాషువాంగ్ అక్కా !''

''ప్రాణాలు ఇచ్చైనా సరే అలాగే చేద్దాం !" అందిరూ దృఢంగా నిశ్చయించుకొన్నారు.

నేను తీవ్రంగా కదిలిపోయాను. టాషువాంగ్ వదినకి నా సందేహాలు చెప్పాను. నవ్వుతూ ఆవిడ నాకు ధైర్యం చెప్పింది. ''చాంగ్ బాబాయి కిందటిసారి పది బానలు పంపాడన్న సంగతి గుర్తులేదా చిన్నిలీ ? పక్క గ్రామం నించి కూడా కొద్దిరోజుల కిందట మనకి పదిహేను బానలు వచ్చాయి కదా ! మన దగ్గర వున్న అయిదూ వీటికి కలుపుకుంటే అన్నీ కలిపి మొత్తం ముప్పై. ఒక్కొబానలో పదహారు బకెట్ల నీరు పడుతుంది. ఆ లెక్కన అన్నిట్లో కలిపి నాలుగు వందల ఎనభై బకెట్ల నీళ్ళు పడతాయి. అవి సరిపోవంటావా ?"

"ఓ, చాలు! చచ్చేన్ని! మరి అన్ని నీళ్ళు తేవటమెలా? తెచ్చినా ఆబానలన్నీ దాయట మెలా?"

"మనం ప్రజలమీద నమ్మకమున్న వాళ్ళం. ప్రజలు మన పక్షాన వుంటే మనం చెయ్యలేని దేముంటుంది?"

జిల్లా రాజకీయ శాఖ ఉపాధ్యాయుడి నాయకత్వంలో ఎన్నో గ్రామాల్నించి ప్రజలు వచ్చి, బకెట్లు, చేతుల్తో మోసీ, బళ్ళమీద తీసుకువచ్చి, కొద్ది రాత్రుల్లోనే ముప్పై బానలూ అంచుల వరకూ నింపేశారు. బానలన్నిట్నీ పలకలతో మూసేసి, కుటీరానికి పడమరగా రోడ్డు కింద కప్పెట్టేశారు. తర్వాత రోడ్డంతా చెట్ల కొమ్మల్తో తుడిచేసి, అటూ ఇటూ నడిచి మామూలుగా చేశారు. ఆ బానల్ని కనిపెట్టటం ఇక ఎవ్వరికీ సాధ్యం కాదు.

జపానీయుల 'ముట్టడి పథకం' మొదలయ్యింది. సెప్టెంబర్ పదిహేడు ఉదయం. శత్రువులతో పోరాడుతున్న సైనికులకి నీళ్ళందించటం కోసం టాషువాంగ్ వదిన పదముగ్గురు మనుషుల్ని బైటికి పంపింది.

మధ్యాహ్నం—వాళ్ళింకా తిరిగిరాలేదు- ఒక ముఠా జపాన్ సైనికులూ, కీలు బొమ్మ సైనికులూ రహస్యంగా కుటీరం దగ్గరికి వస్తున్నారు,

వాళ్ళని చూస్తూనే టాఘువాంగ్ వదిన, రెండు గోడల మధ్యనవున్న రహస్య ప్రదేశంలో దాక్కోమని బలవంతం చేసింది. ఆవిడని ఒంటరిగా వదలటం ఇష్టం లేక, దానికి ఒప్పుకోలేదు నేను. "చెప్పినట్టు చెయ్యి. నా అనుమతి లేకుండా బైటికిరాకు" ఆవిడ కఠినంగా ఆజ్ఞాపించి చివరకు నన్నా రహస్యపు అరలోకి నెట్టే సింది.

శత్రువు బయట అరవటం వినిపిస్తోంది. టాఘువాంగ్ వదిన బైటకి వెళ్ళి నట్టుగా తలుపు కిర్రుమంది.

"హ్హి! హ్హి! మనది చాలా చిన్న ప్రపంచం. ఆనవాలు పట్టావా నన్ను?" 'బంగారుపళ్ళు' గాడి గొంతు వినపడి, నా గుండె కొట్టుకోవటం మానేసింది.

పన్నెండు మంది కీలుబొమ్మ సైనికులు బాయ్‌నెట్లు టాఘువాంగ్ వదినకి గురి పెట్టి వుంచటం కనిపించింది; గోడకున్న పగులుగుండా, ఒక నల్లటి మొద్దు లాంటివాడు, 'బంగారుపళ్ళు' గాడి వెనక నించొని వున్నాడు. వాణ్ణి గుర్తుపట్టాను. సగూచీ! వాడు జపాన్‌వాళ్ళ 'లాజిస్టిక్స్' శాఖకి స్క్వాడ్ లీడర్. కిందటేడు ధాన్యం కోసం జరిగిన పోరాటాల్లో వాణ్ణి అనేకసార్లు చూశాను.

వాడు వెకిలిగా నవ్వుతూ, ముందుకు అడుగేసి టాఘువాంగ్ వదిన కేసి చీకిరి కళ్ళతో చూస్తూ వచ్చీరాని చైనాభాషలో నట్టుతూ "నువ్వు ఎర్ర సైన్యం మనిషివి కదూ! చెప్పు నీళ్ళెక్కడ దాచావు?" అన్నాడు.

"నా దగ్గర నీళ్ళు లేవు" టాఘువాంగ్ వదిన శాంతంగా జవాబు చెప్పింది.

"మమ్మల్ని వెర్రివాళ్ళని చేద్దామనే? మా మనుషుల్ని ఏడుగుర్ని చంపిన వాళ్ళెవరు? జపాన్ సైన్యం ఎంతో దయగలది కాబట్టి కిందటిసారి పోనీలే అని వూరుకొంది. ఇవ్వాళ్ళన్నా మాకు సహాయం చెయ్యకపోతే రేపటి కుండపు చూట్టానికి'' వెటకారంగా అన్నాడు 'బంగారు పళ్ళు'

"సరేలే ! నీళ్ళెక్కడున్నాయోచెప్పు. నిన్ను వదిలేస్తాను. ఇంత డబ్బు కూడా ఇస్తాను" అన్నాడు సగూచీ.

"నాదగ్గర నీళ్ళులేవు" టాఘువాంగ్ వదిన మళ్ళీఅంది.

"నీయమ్మ! అబద్ధాలముండా ! ప్రతీరోజూ బకెట్లు బకెట్లు మోసుకొస్తావు ఎక్కడున్నాయవన్నీ ? ఆ బానలెక్కడున్నాయి ?"

"బానలు తెచ్చిన మనుషులు వాటిని యుంగన్‌సంతలో అమ్ముకొన్నారు. నేనూ నాకొడుకూ వంటకోసం నీళ్ళు తెచ్చుకుంటాము" నిదానంగా అంది టాఘువాంగ్ వదిన.

"వెతకండి !" సగూచీ బొంగురు గొంతుతో అరిచాడు. జపాన్ సైనికులు

కుటీరంలో జొరబడి అంగుళం అంగుళం వెతికారు. వస్తువలన్ని ట్లోకీబాయ్‌నెట్లు గుచ్చి వాటిని విరజిమ్మి అంతా సంతసంత చేసి వదిలిపెట్టారు.

ఒక మోటార్‌సైకిల్ మోత వినిపించింది. ఒక సైనికుడు మోటార్‌సైకిల్ దిగి ఏదో వార్త అందించాడు నగూచీకి. స్పష్టమే ! నీళ్ళువెతకమని మరో కఠినమైన ఉత్తర్వు.

మోటార్‌సైకిల్ వెళ్ళిపోయిన తర్వాత నగూచీ బోనులో తోడేలులా కోపంగా అటూ ఇటూ పచార్లు చేశాడు.

"అది నీళ్ళివ్వకపోతే గుడిసె అంటించెయ్యండి" హఠాత్తుగా పెద్ద బొబ్బ పెట్టాడు.

నాగుండె ధడేల్‌మంది. సరే, నీళ్ళు జాగ్రత్తగా వుంటే నేను తగలబడి పోయినా ఫరవాలేదు. టాషువాంగ్‌వదిన కనుబొమలు ముడతపడి మళ్ళీ మామూలుగా అవటం కనిపించిందినాకు. ఏవో కఠినపరీక్షకు సిద్ధమైనట్లు గట్టిగాఅంది "ఆగండి! నీళ్ళెక్కడున్నాయో తెలుసునాకు."

నగూచీ విజయగర్వంతో గట్టిగానవ్వి "మంచిది మంచిది ! ఎక్కడ?" అన్నాడు.

"ఇక్కడికి తూర్పుగా"

"ఎంతదూరంలో ?"

"సుమారు ఎనిమిదీ కిలోమీటర్ల దూరంలో."

"ఎనిమిది కిలోమీటర్లా ?" నగూచీ తలవిదిలించాడు. ఎర్రటికళ్ళతో టాషువాంగ్ వదినవంక క్రూరంగా చూస్తూ "అబద్ధమాడుతున్నావా" గుర్రుమన్నాడు.

'బంగారు పళ్ళు' గాడు అందుకొన్నాడు. "పిచ్చివేషాలు వెయ్యొద్దని చెప్ప లేదూ నేన్నీకు ? జపాన్‌దొరల్ని ఎదిరించి బతకలేవు. నీ తప్పులన్నీ క్షమిస్తాం ; నీళ్ళెక్కడున్నాయో చూపించు. మోసంచేశావో జాగ్రత్త ప్రాణంతీసి పగతీర్చు కొంటాం" అన్నాడు.

"నమ్మినా మానినా అది మీఇష్టం" టాషువాంగ్‌వదిన జవాబిచ్చింది మెల్లిగా.

'బంగారుపళ్ళు'గాడు నగూచీ వైపు తిరిగి "ఎనిమిది కిలోమీటర్ల దూరంలో నీళ్ళుదొరికితే అదేమీ పెద్ద దూరంకాదు దొరవారూ ! మరోపక్క ఎలాగా మనం చేసేదీ ఏమీలేదు. కాబట్టి......"

"దారిచూపించు" ఆజ్ఞాపించాడు నగూచీ.

"వినిపించిందా ? నువ్వక్కడకి తీసుకెళ్ళాలి మమ్మల్ని. ఊఁ! కదులు." ఉత్తర్వు జారీచేశాడు 'బంగారుపళ్లు'గాడు.

నిశ్శబ్దంగా టాషువాంగ్‌వదిన తలుపుకి తాళంవేసి చెవి, కుటీరానికి తూర్పు వేపున వున్న ముళ్ళచెట్లలో ఒక చెట్టుమీద తాళంచెవితల ఉత్తరం వైపు వుండేలా పెట్టి, శత్రుసైనికుల్ని తూర్పుగా నడిపించుకు పోయింది.

ఎంతోసేపు అవకముందే టియెన్ షెన్ వచ్చాడు. తలుపుకు తాళంవేసి వుండటం చూసి చెవికోసం వెతికాడు. తాళంచెవి దాచిన స్థానం వాళ్లు ముందుగానే నిర్ణయించుకొన్న సూచన !

వాడు తలుపు తెరిచి, ''బాబాయ్ ! మిలిషియా మనుషుల్ని తెచ్చి శత్రువుల్ని తుడిచిపెట్టెయ్యమంటోంది అమ్మ'' అన్నాడు నాతో.

''అవిణ్ణి కలుసుకున్నావా నువ్వు ?''

''లేదు. కానీ తాళంచెవి దాచిన చోటువల్ల తెలిసిందినాకు. నేవెళ్తున్నా బాబాయ్'' అని గుర్రంలా వేగంగా దూసుకుపోయాడు.

నేను నిరాశతో విచారంలో పడ్డాను. నన్నూ, నీటినీ రక్షించటంకోసం టాషువాంగ్ వదిన తనప్రాణాల్ని ప్రమాదంలో పెట్టుకొంది. అలా జరగనివ్వను !

నాకున్న రెండు గ్రేనేడ్లూ తీసుకొని వాళ్ళవెనకే బయలు దేరాను. ఆకాశంలో బూడిదరంగు మేఘాలు దట్టమవుతున్నాయి. ఎక్కడా చిన్నపాటి గాలితెరైనా లేదు. నాతల తిరిగింది. తుఫాను రాబోతున్నట్టుగా వుంది. గాయంనొప్పిని లక్ష్యపెట్టకుండా ముళ్లపొదల్లోంచి వున్న అడుగుజాడల ఆధారంగా నడుస్తున్నాను. కాస్సేపట్లోనే వాళ్లందరూ కనిపించారు. వాళ్లు టాషువాంగ్ వదిన వెనక నీరసంగా యీడ్చుకొంటూ నడుస్తున్నారు. తమవొంటిమీదినించి అలంకారాలన్నీ ఒక్కటొక్కటే వూడిపోతున్నా వాళ్లు పట్టించుకోవటంలేదు. తలలు వేళ్లాడేసి పూర్తిగా అలిసిపోయినట్టు కనిపిస్తున్నారు. గబగబా వూపిరి తీసుకొంటూ, అప్పుడప్పుడూ ఎండిపోయినపెదాలు నాక్కొంటున్నారు.

రెండు గంటలు గడిచిపోయినా టియెన్ షెన్ జాడాలేదు, ఎర్రసైనికుల జాడా లేదు. నా ఆతృత పెరిగిపోతోంది.

నగూచీ గుర్రుమన్నాడు "నీళ్ళు—ఎక్కడ?"

"ఆ పైన" టాషువాంగ్ వదిన ఆగింది. కొందరు సైనికులు ఈ అవకాశాన్ని జారవిడుచుకోకుండా చెట్లకానుకున్నారు. మరికొంతమంది నేలమీద కూలబడ్డారు. వాళ్ళని చూపిస్తూ టాషువాంగ్ వదిన "మీ సైనికులు నత్తల్లా నడుస్తున్నారు. ఈ లెక్కలో మనం ఇంకో రెండు గంటలగ్గానీ అక్కడికి చేరలేం" అంది.

నగూచీ తన మనుషుల మీద గావుకేక లేశాడు. కానీ ఈ సారి టాషువాంగ్ వదిన వాళ్ళందర్నీ ముందుకు తీసుకుపోవటానికి బదులు వచ్చిన దారెమ్మటే మళ్ళీ వెనక్కి తీసుకొస్తోంది.

కాస్సేపటికి 'బంగారు పళ్ళు' గాడు హఠాత్తుగా కనిపెట్టేశాడది. వెంటనే నగూచీకి చెప్పేశాడు. మొహం వెలవెలాబోయి నగూచీ కోపంగా "దొంగలంజ ! చంపెయ్యండి దాన్ని'' అని మొరిగాడు.

నేను ఆగ్రహంతో ఒక గ్రెనేడ్ బయటికి లాగాను శత్రువుమీద విసరటానికి. సరిగ్గా అదే సమయానికి రైఫిల్ కాల్పులు మొదలయ్యాయి. జపాన్ సైనికులు ఒకరి వెనుక ఒకరు నేలరాలిపోసాగారు.

అవును వాళ్ళే! ఎర్రసైనికులు. నేను నా శక్తికొద్దీ రెండు గ్రెనేడ్లూ విసిరేశాను. సగాచీ, 'బంగారుపళ్ళు' గాడూ ఇంకొందరు జపాన్ సైనికులూ ఎగిరి కింద పడ్డారు దుంగల్లా. చావకుండా మిగిలిన వాళ్ళు తలలు తెగిన ఈగల్లా అటూ ఇటూ ఎగరసాగారు. కానీ వాళ్ళందర్నీ ఎర్ర సైనికులు వెంటనే బంధించేశారు. చాంగ్‌బాబాయీ నేను టాషువాంగ్ వదిన దగ్గరికి పరిగెత్తాం.

"ఉత్తరాన రెండు వందలకి పైగా శత్రుసైనికుల్ని మన వాళ్ళు చుట్టుముట్టేశారు. త్వరలోనే అందర్నీ తుడిచి పెట్టేస్తారు" చాంగ్‌బాబాయి నూతనోత్తేజంతో చెప్పాడు మాకు.

విజయసూచకమైన చిరునవ్వు వెలిగింది టాషువాంగ్ వదిన పెదాలమీద. ఆవిడ కామ్రేడ్లనందర్నీ ఎర్రసేన కుటీరానికి నడిపించింది, పాతివున్న బాసల్ని పైకి తీయించేందుకు. తర్వాత స్టౌ అంటించింది నీళ్ళుకాగబెట్టడానికీ, అన్నం వండటానికీ. కాగుకింద ఎండుపుల్లలు పటపటమన్నాయి, అవికూడా మా విజయానికి ఉత్సవం జరుపుకొంటున్నట్టు.

శత్రువునించి సంపాదించిన రైఫిల్ బుజానేసుకొని, మిలిషియా మనుషులతోపాటు, ఎర్రసేన కుటీరాన్ని విడిచి వెళ్ళాను మా దళాల్ని కలుసుకొనేందుకు.

మునిమాపువేళ. యుద్ధం భయంకరంగా సాగుతున్న సమయాన, టాషువాంగ్ వదినా ఇతర కామ్రేడ్లూ మా కోసం భోజనాలు తెచ్చారు. ప్రతీ మనిషికీ అతని వాటా అందిస్తూ ఆవిడ "బాగా చావగొట్టండి కామ్రేడ్స్! బందిపోటు వెధవల్నందర్నీ చైనానించి తరిమి కొట్టండి. దురాక్రమణదారుల్ని ఊడ్చి పారెయ్యండి" అని అరిచింది.

అస్తమించే సూర్యుడి కింద మా అరుణ పతాకం రెపరెపలాడుతూ, ఎర్రని కాంతి పుంజాల్ని విరజిమ్మింది-ముళ్ల చెట్లమీదా, టాషువాంగ్ వదిన మీదా.

*　　*　　*

**ముందుమాట :**

గత పాతికేళ్ళుగా నటరాజ కళాసమితి–శ్రీకాకుళం (శ్రీ జె. వి. సోమయాజులు వగయిరాలతో) 'కన్యాశుల్కం' ప్రదర్శిస్తూ ఇటీవల ఒక సావనీర్ ప్రచురించింది. 'కన్యాశుల్కం' సందేశంగాని, గురజాడ చైతన్యంగాని ఈ సంచికలో మనకి కనిపించవు. గురజాడ భావాల గురించి ఇంకా మనం తెలుసుకోవలసింది ఎంతో వుంది. అందుకోసం యీ వ్యాసం కేవలం ఓ చిన్న ప్రయత్నం.

## రామప్పంతులు

**పినాకపాణి**

సంఘ సంస్కరణోద్యమాన్ని ముందుకు తీసుకు పోవడానికీ, తెలుగు భాష నాటకానికి పనికి రాదనే అపోహని ఎదుర్కోడానికీ గురజాడ కన్యాశుల్కం రాశాడు. ఇందులోని హాస్యమూ, పాత్రీకరణా క్లిష్టమైన, మౌలికమైన కథాసంవిధానం గురజాడ అసమాన మేధాశక్తికి నిదర్శనాలు. దీనిని విశ్వజనీనం, విశ్వకాలీనం చేసే అంశం ఇందులో ఉన్న సమకాలిక జీవిత చిత్రణే. వివిధ రకాల వ్యక్తులు, మానసిక ప్రవృత్తులు, జీవిత సంఘటనలు ఇందులో మనకు తారస పడతారు, అవగతమవుతాయి, ఎదురవుతాయి. పాత్రీకరణ విషయంలో గురజాడ types ని సృజించడమే కాకుండా, వాటిలో జీవితాన్ని సంతరింప చేశాడు. అందు చేతనే కన్యాశుల్కం లోని పాత్రలు మనకు జీవితంలో తటస్థ పడతాయి.

కన్యాశుల్కం నాటకంలో ప్రధాన వస్తువు బాల్య వివాహాలు, కన్యాశుల్కాలు. ఈ నాటకానికి ఇరుసు సుబ్బి పెళ్ళి. ఈ సుబ్బి నాటకమంతా రంగం మీదికి రానేరాదు. ఆ పెళ్ళికూడా చివరికి కానేకాదు. అగ్నిహోత్రావధాన్లు "తాంబోలం ఇచ్చేశాను, యిహ తన్నుకు చావండి" అనే సవాలు విసిరిన తర్వాత, ఈ పెళ్ళి భగ్నం చేయటానికి కరటక శాస్త్రి పూనుకుంటాడు. ఇక తరవాత కథంతా కరటక శాస్త్రి వ్యూహం ప్రకారమే జరుగుతుంది. ఈ వ్యూహంలో రామప్పంతులిది ప్రధాన పాత్ర.

రామప్పంతులు ఒక సందర్భంలో తన గురించి ఇలా చెప్పుకుంటాడు. "యీ తాలూకాలో సివిలు మేజిస్ట్రేట్లు యెవ్వరొచ్చినా రామప్పంతులు పప్పులేని పులగం వుండదు." ఈ మాటల్నే మనం కన్యాశుల్కంలో రామప్పంతులు పాత్ర విషయంలో కూడా చెప్పవచ్చు. కన్యాశుల్కంలో రామప్పంతులు పప్పులేని పులగం వుండదు. అందుకే కరటక శాస్త్రులు సుబ్బి పెళ్ళి చెడగొట్టడానికి తాను ఎత్తిన పన్నుగడలో రామప్పంతుల్ని పావుగా ఎంచుకున్నాడు. అయితే రామప్పంతులికి తాను పావుననే విషయం తెలియదు. రామప్పంతులు గుణగణా లెట్లాంటివి ? కరటక శాస్త్రి వ్యూహాన్ని అతడే ఎందుకు విజయవంతంగా అమలు జరపగలడు ?

రామప్పంతులు 19వ శతాబ్దం ఆఖరు భాగంలో వాడు. రామచంద్రపురం అగ్రహారం వాస్తవ్యుడు. నియోగి * (వివాహం చేయించడానికి నేను వైదీకిని కాను. నాకు మంత్రాలు రావే" అంటే కరటకశాస్త్రి "మంత్రమంటే నియ్యోగ ప్రభువుదే మంత్రం" అంటాడు). వైదీకులంటే contempt. ("వైదికం! వైదికం మీ వేదువులు మీరు యేదవక లోకంలో భోగట్టా అంతా మీకెందుకు ?"). మధ్య వయస్కుడు. ("కొంచెం గెడ్డం నెరుస్తూంది, నన్ను కూడా ముసలాణ్ణంటావాయేవిటి") పెళ్ళి చేసుకోలేదు. (మధురవాణి కరటకశాస్త్రితో, "మా పంతులుకేనా పెళ్ళి ?") పిత్రార్జితం అంతా కరరావుడు చుట్టివేశాడు. భూవులు తణఖాలో వున్నాయి. (అబద్ధమని దబాయించినా). సొంతడబ్బా తెగ మోగిస్తాడు. ("చిన్నతనంలో ధ్వజస్తంభం దండతో కొడితే గణ గణ మని గంటలన్నీ ఒక గడియ వాగేవి.") 'అడజబ్బు' హెచ్చు. (మధురవాణి : "మీరు కంటపడ్డ తర్వాత యే అడదాని ప్రవర్తన తిన్నగా వుంటుంది." రామప్పంతులు: "నాకు యింగిలీషువస్తే దొరసానులు నావెనకాతల వడుగెత్తరా ?") శాక్తేయుణ్ణని చెప్పుకుంటాడు. యోగసాధనం చేస్తా డట. (ఏయోగం ?) "కామిగాక మోక్షకామిగాడు". పిరికివాడు. ("కోర్టు వ్యవహార మంటే చెప్పు. యెత్తుకి యెత్తు యింద్రజాలంలా యెత్తుతాను. చెయి ముట్టు సరస మంటే మాత్రం నాకు కరచరణాలు ఆడవు") సిద్ధహస్తుడైన ఫోర్జరీదారు. ("నా దగ్గిర పాత తాటాకులు, అలేఖాలు అటక నిండా ఉన్నాయి. ముప్ఫైయేళ్ళనాటి కాకితాలున్నాయి. రకరకాల సిరాలున్నాయి. ఒక నూర్రూపాయిలు నాకు ఫీజు క్రింద ఇచ్చి ఖర్చులు పెట్టుకోండి. గ్రంథం నడిపిస్తాను. ఉత్తరం అగ్నిహోత్రావ ధాన్లు పేరు పెట్టి నేనే బనాయించాను".) గొప్ప కోర్టు పక్షి ("యీ తాలూకాలో సివిలు మేజిస్ట్రేట్లు యెక్కడొచ్చినా రామప్పంతులు పప్పులేని పులగం వుండదు").

నలభై యాభై రూపాయల వ్యవహారాల్లో చొరబడేవాణ్ణి కాసంటూనే హెడ్డు కానిస్టేబు దగ్గర మూడు రూపాయలకే కక్కుర్తి పడతాడు.

("కొంచెం చిల్లర ఖర్చుంది. ఏం జెయ్యను. ఇలా పారేయండి")

లౌక్య ప్రజ్ఞని విశేషంగా వినియోగిస్తాడు ("నమ్మించోట చేస్తే మోసం,

---

* ఒక ఆసక్తికరమైన విషయం. కన్యాశుల్కం మొదటి ముద్రణలో రామప్పంతులు కూడా వైదీకే. అక్కడ రామప్పంతులు ఇలా అంటాడు : "పేరు గొప్పా, ఊరు దిబ్బా అన్నట్టు యీ మార్తులు, యీ కరణకమ్మలు, యీ నియ్యోగులు లౌక్యానికి మన వాళ్ళతో పనికి వస్తారండీ...నియ్యోగి యేమిటి, వైదీకి యేమిటి. ఇంగ్లీషు అభివృద్ధి అయిన దగ్గరనుంచీ మన వైదీకులము కూడా పంతుళ్ళ వారము అవుతున్నాము." బహుశా ఎంత లౌక్యుడైన వైదీకి కూడా నియ్యోగితో తూగలేడని, రామప్పంతుల్ని రెండవ ముద్రణలో వైదీకులంటే ఎంతో contempt కనబర్చే నియోగిగా మార్చివేసి ఉంటాడు గురజాడ.

నమ్మంచోట చేస్తే లౌక్యమూను" లౌక్యవృత్తి—"నిజాన్ని పోలిన అబద్ధ(వాడి ద్రవ్యాకర్షణ చేసేగి", "మా లౌక్యం మాతో స్వతహాగా పుట్టినది.")

అవసరమైతే తన రింగునవున్న యినప ములికితో యే పెట్టి తాళం అయినా తీసేస్తాడు, అందుకే అతను నిలబడ్డచోట రూపాయలు గలగలలాడ్తాయి. అతనిది ధన జాతకం. అందుకే డబ్బులా వస్తూఉంటుంది. పాపపు సొమ్ము అతని దగ్గరికి రాగానే పవిత్రమైపోతుంది.

అవసరం కొద్దీ కల్పనలు చేస్తాడు. (కొంచెం కల్పనుంటేగానీ కథనడవదు") ఇన్ని అద్భుతమైన గుణాలున్న వ్యక్తిని కరటక శాస్త్రి ఉత్తినే ఎంచుకోలేదు. కార్యాన్ని సాధించడానికి ఏ పని చేయడానికి వెనకాడడు, హత్యలుతప్ప.

ఒకరకంగా చూస్తే గిరీశం, రామప్పంతులు ఒక నాణానికి రెండు ముఖాల్లాంటి వాళ్ళు. వీళ్ళిద్దరూ కూడా శకారుడికి వారసులేనని చెప్పవచ్చు. శకారుడిలోని విచిత్రవాక్య విన్యాసం, హాస్యం గిరీశానికి పట్టుబడితే, అతని దౌష్ట్యం రామప్పంతులులో చోటు చేసుకుంది.

మీనాక్షిని క్రిందికి పడవేసిన సందర్భంలో మధురవాణి "ఆడదాని మీదా చెయిజేసుకుంటారు? ఏమి పౌరుషం?" అని కోపపడుతుంది. ఇలాంటి పౌరుషాన్నే 'మృచ్ఛకటికం' లో శకారుడు ప్రదర్శిస్తాడు. "ఆడవారైనచో వందలకొలది వచ్చినను జంపుటకు శూరుడనే" అని గొప్పలు చెప్పుకుంటాడు. ఇంకొకచోట "దేవతల ముందరను, బ్రాహ్మణుల ముందరను కాలినడకనేల వత్తును? బండియెక్కియే వచ్చెదను" అంటాడు. రామప్పంతులు కూడా యినస్పెక్టర్ పంపున వచ్చిన హెడ్ కానిస్టేబ్‌తో "మీరు ముందు పదండి. గుర్రం కట్టించుకుని స్టేషన్ దగ్గర కలుస్తాను" అంటాడు.

శకారుడు వసంతసేనని మెడ పిసికి, చనిపోయిందనుకుని "ధన నిమిత్తము చారుదత్తుడు నా పుష్పకరండకోద్యానంబున వసంతసేనయను సానిదానిం జంపి పారవేసినాడని వ్యవహారపత్రమొసంగి తగవు నడుపుతాడు. రామప్పంతులు గుంటూరు శాస్త్రులు కూతుర్ని లుబ్ధావధాన్లు చంపివేశాడని యినస్పెక్టరుకి ఒకటి, తాసిల్దారుకి ఒకటి ఆకాశరామన్న అర్జీలు పంపుతాడు. చివరికి ఇద్దరూ తమకుట్రలో విఫలమౌతారు.

గిరీశం వైదీకీ, రామప్పంతులు నియోగీ అయినా చాలా విషయాల్లో వాళ్ళిద్దరికీ సామ్యముంది. అప్పుడే, అంటే పందొమ్మిదవ శతాబ్దం అఖర్లో (1895 ప్రాంతం) వ్యాప్తిలోకి వస్తున్న వ్యాపార నాగరికతకి ఒకరు పట్టణ ప్రతినిధిఅయితే, ఇంకొకరు పల్లె ప్రతినిధి. అప్పటికి యూనివర్శిటీ విద్యావిధానం అమల్లోకి వచ్చి 50 సంవత్సరాలైంది. పాశ్చాత్య సంస్కృతి ఆధిక్యతలోకి వచ్చింది. కాంగ్రెస్‌పార్టీ

ఏర్పడి ఒక దశాబ్దం అయింది. దేశంలో కొన్ని శతాబ్దాలుగా అమల్లోఉన్న సామాజిక విలువలు కొత్తవిలువలకి తావివ్వడం ప్రారంభించాయి. ఈ కొత్త విలువలు సహజంగా డబ్బుని కేంద్రంగా కలిగివున్నాయి. గిరీశం, రామప్పంతులు యీ విలువలకి ప్రతినిధులు. అప్పుడే ప్రాదుర్భావం చెందుతూన్న ఆధునిక మధ్యతరగతిని వీళ్ళలో చూడవచ్చు. ఈ తరగతి "మనిషికీ మనిషికీ మధ్య నగ్నమైన స్వలాభం తప్ప, కిరాతకమైన లావాదేవీ తప్ప యిక ఏ సంబంధాన్ని మిగలనివ్వదు. మతావేశం వల్లా, మూర్ఖపు మమకారాలవల్లా కలిగే అలౌకిక ఆనందాలన్నిటినీ అది స్వలాభమనే కత్తితో నరికివేస్తుంది. అదిమనిషి విలువను రూపాయల్లోకి మారుస్తుంది. శాసనాలు ప్రసాదించిన అసంఖ్యాకమైన సుస్థిర స్వాతంత్ర్యాలను అంతమొందించి, వాటికి బదులు వ్యాపార స్వాతంత్ర్యాన్ని నెలకొల్పుతుంది. వైద్యులనూ, న్యాయవాదులనూ, కవులనూ, శాస్త్రవేత్తలనూ, అది తనకింద కూలికి పనిచేసే నౌకర్లుగా మార్చివేస్తుంది. ("రెండు సంచులతో కూనీకేసంతా మంచు విడిపోయినట్టు విడిపోతుంది.") కుటుంబ వ్యవస్థ మీద వున్న మమకారాల మేలి ముసుగును చించి పారవేసి, కుటుంబ సంబంధాలను కేవలం ఆర్థిక సంబంధాలుగా దిగజార్చివేస్తుంది." అంటూ ఈ వ్యవస్థని కళ్లకు కట్టాడు కారల్ మార్క్స్.

ఈ రకమైన తరగతికి ప్రాతినిధ్యం వహించే రామప్పంతులు గిరీశం చివరికి సౌజన్యారావు పంతులు దగ్గర శృంగ భంగం పొందుతాడు. సౌజన్యరావుపంతులు రామప్పంతుల్ని చూడగానే "నీ సంగతి నాకు తెలుసును. అవతలికి నడువు" అంటాడు. అతడు ఏదో చెప్పబోయేటప్పటికి మళ్లీ "నడువు" అంటాడు. దానితో రామప్పంతులు మరో మాటలేకుండా నిష్క్రమిస్తాడు. గిరీశం అలాకాకుండా, తన సహజ ధోరణిలో "డామిట్! కథ అడ్డంతిరిగింది." అనిగాని నిష్క్రమించడు

వీళ్లిద్దరూ ప్రాతినిధ్యం వహించిన తరగతి ఈనాడు దేశంలోని మూల మూలలకీ తామరతంపరగా అల్లుకుపోయింది. ఇవాళ ఎంతమందో రామప్పంతుళ్ళు దేశంలోని అన్నిరంగాల ఆయువుపట్లనీ తమపిడికిళ్లలో ఒగించి, జీవితాన్ని శాసిస్తున్నారు. వీళ్లని బయటకి నడిపించే సౌజన్యరావు పంతుళ్లకి స్వాగతం.

చివరిమాట :—

"కేవలం ధనైక లౌబ్ధ్యంతో కన్యాశుల్కాన్ని ఒక మ్యూజికల్ కామెడీగా తయారు చెయ్యడాన్ని హర్షించలేనివాడు ఈ లోకంలో ఒకడైనా వున్నాడు.''

శ్రీ శ్రీ (1945)

నవల—సీరియల్



# తుఫాను

**చౌలి—పో**

రెండవ భాగం

(గత సంచిక తరువాయి)

16

సూర్యకిరణాలు పడి కిటికీ అద్దాలు మెరుస్తున్నాయి. చెట్లమీద పిచికలు కిచ కిచ మంటూ ఒక కొమ్మ మీంచి మరో కొమ్మమీదికి గెంతుతున్నాయి. సియావోలేచి బట్టలు వేసుకుని ముఖం కడుక్కొని కువోతో జరగబోయే రెండు మీటింగుల వివరాలు ముచ్చటించేడు. మొదటి మీటింగు ముసలివాళ్ళతో రైతుసంఘం ఆఫీసులో జరుగుతుంది. రెండో మీటింగు అన్నిరకాల జులాయిగాళ్ళతో ఆఫీసు తూర్పు వసారాలో జరుగుతుంది. ముసలాళ్ళని చూసుకునే బాధ్యత ఓల్డ్‌సన్, తీన్ తాతలది. జులాయిగాళ్ళను చూసుకునేబాధ్యత చాంగ్ చింగ్—షీ,కువోలది.మిగిలిన రైతుసంఘం ఆఫీసర్లు భూస్వాముల దగ్గరనుండి జప్తు చేసుకున్న సొమ్ము, వస్తువులు వాటాలువేసి, వాటి ధరలుకట్టి, ధరలపట్టీ వాటికంటించి, ఎవరెవరికి ఎంత ముడుతుందో లెక్కలు తయారు చేయాలి.

మధ్యాహ్నం భోజనాలయ్యేక జనం నెమ్మదిగా ఆఫీసు దగ్గరకు చేరేరు. అంత దూరం నడవలేని ముసిలాళ్ళకి రైతు సంఘం స్లెడ్జిలు పంపింది.

ఊరి జులాయిగాళ్ళంతా తూర్పు వసారాలో చేరేరు. ఒకే వూరి వాళ్ళవడంవలన ఎవరేంచేసేరో అందరికీ తెలుసు. ఒకరినొకరు కొంటె నవ్వులతో పలకరించు కున్నారు. బల్లమీద పొద్దు తిరుగుడు గింజల గుట్ట పోసేరు. మరోపక్క బుట్టెడు

పొగాకు, సిగరెట్లు చుట్టుకునే కాయితం వున్నాయి. కొందరు పొద్దు తిరుగుడు గింజ లొలిచేరు. మరికొందరు సిగరెట్లు చుట్టేరు. వాళ్లలో 'గాడిదలీ' అనేవాడు లేచి, మెడ పక్కకు వంచి

"సెయిర్మన్ కువో! మమ్మల్నీడ కెందుకు పిలిచేరు?" అని అడిగేడు.

"ఇది కొత్త సంవత్సరంలో మొదటినెల కదా, అందుకని పూరికే మాటాడు కుందాఁవని. రైతు సంఘం గురించి మీరెవులన్నా మాటాడొచ్చు. అది బాగా పని సేస్తాందా? ఇంకేమన్నా మార్పు సెయ్యాలా?" అని ప్రశ్నించేడు కువో.

"నానేటి సెప్తాను? అంతా బాగున్నాది అంటూ ముఖం ముప్పయి వంకరలు తిప్పేడు గాడిదలీ.

కొందరు కన్నుగీటి నవ్వేరు. మరికొందరు కాంగ్‌మీద బద్ధకంగా నడుం వాల్చేరు. ఇంకొందరు సిగరెట్ పొగ వలయాలుగా వదులుతున్నారు. గాడిదలీ గోడ కానుకుని మునీశ్వరుడిలా కళ్లు మూసుకున్నాడు. వాళ్లని ఎలాగోలాగ మాట్లాడించాలనే వుద్దేశ్యంతో కువో,

"ఈ మద్దిన వూరందరికీ ఓ మీటింగు పెట్టేం మీరెవులన్నా ఒచ్చేరా? రాలేదు కాదా?" అని అడిగేడు.

ఎవరూ మాటాడలేదు. గాడిదలీ నెమ్మదిగా కళ్లు తెరిచి, ఓ చిరునవ్వు నవ్వి "మాం కానోల్లం కాదా, మాఁవేటి సెప్పినా తప్పే" నన్నాడు.

"నీ గ్రూపేటి?" అనడిగేడు చాంగ్ చింగ్-షీ.

"నానో పెద్దకాఁవందుని" అన్నాడు ఎగతాళిగా.

అందరూ గ్రూపు తగ్గించు కోవాలని సూత్తారు. కాఁవందులు పెద్ద రైతులఁవంతారు: పెద్ద రైతులు మద్దె తరగతి రైతులఁవంతారు. మరి నువ్వేటి నీ గ్రూపుని పెంచుకుంతన్నావ్?"

గాడిదలీ నువ్వుకుని,

"మునుపు పేదోల్లు బాదలు పడీవోరు. అప్పుడు నానూ పేదనే. ఉప్పుడు కాఁవందులు బాదపడతన్నారు. గనక నానూ కాఁవందునే. ఏఁవన్నా అనుగాని బాబూ, నాను మీలాటోన్ని కాను. నాను మీలాటోన్ని కాను. నాను గట్టిపడీదాకా మీటింగులకి రాను. మరి నాకు సెలవిప్పించండి" అన్నాడు కచ్చితంగా. కువో అతన్ని వారిస్తుంటే చేతులటూ ఇటూ తిప్పుతూ అందరినీ నవ్వించేడు. అదే సమయంలో సియావో వచ్చి "ఎవరితను?" అని నెమ్మదిగా కువోని అడిగేడు.

''గాడిదలీ''

''అదేం పేరు ?''

''అది జనమిచ్చిన బిరుదు. అసలు పేరు లీ-షా. ఎనిమిదేళ్లవుతాది గావాల,

ఆడు గోడకి[1] అటుకాసివుండీవోడు. ఆ ఇల్లొగ్గేసి రెండు గాడిదలతో బయల్దేరేడు. ఓ గాడిదమీద ఆడి ఆడదాయి, ఐదేల్లకొడుకు కూకుంటే, రెండోదానిమీద సామాను కట్టేడు. ఈ వూల్లో గాడిదలు లేవుకదా, ఒక్క మనిసి రెండు గాడిదలతో రావడం సూసి ఆడినందరు 'గాడిదలీ' అని పిలిసేరు. ఈ 'తు'[2] కాడ పదెకరాల బూఁవి కౌలుకి తీసుకున్నాడు. రెండేల్లలో అప్పులపాలయేడు. గాడిదలమ్మేడుగాని ఆడిపేరు మాత్రం మిగిలి పోనాది. ఆడికొడుకు టైఫాయిడు జొరంతో గాఁవాల కునికీసినాడు. ఆడి ఆడదాయి మరోడితో నెగిసిపోనాది. అదేఁవో బూఁవొగ్గేసి ఇలా తయారై పోనాడు. పనిసెయ్యడు, ఉల్పాగా తిని తిరుగుతాడు. తాగుడు, జూదం, ముండలు- అన్నీ వంటపట్టేంఐ. ఆడిని రైతుసంగంలో సేరమని ఎవులూ అడగలేదు, ఆడూ సేరనేదు'' అన్నాడు కువో.

''అతన్నోసారి నన్ను కలవమని చెప్పు'' అంటూ సియావో వసారా మధ్య కొచ్చి నిలబడ్డాడు. అతన్నిచూడగానే అందరూ గప్‌చుప్ అయిపోయారు. గాడిదలీ కూడా చేతులు కట్టుకుని నిలబడ్డాడు.

''ఒకరినొకరు తెల్సుకోడానికే మేం మిమ్మల్నిక్కడికి పిలిచేం. మనందరికీ ఒకటే పేరు-'పేద'. మనలో ఎవరైనా డబ్బునోళ్లున్నారా ? లోగడ ఎవరైనా తప్పుచేస్తే, అదంతా పాత సమాజం వలన జరిగివుంటుంది. ఇప్పుడు వాడిని తప్పు పట్టలేం.'' అన్నాడు సియావో.

''నిజఁవే. మునుపు యీవూరు బుగతలసేతుల్ల వుండేది. వానాకాలం ఆల్లు జూదఁవాడేవోరు. దాంతో ఆగేవోరా ? నేదే. మమ్మల్నికూడ అందులోకి దించేవోరు. కాదు, కూడ దించే మరి మాకు నూకలుపుట్టవ్'' అన్నాడు గోడకానుకున్న ఓ జూదరి.

''ఉదాహరణకి లీ-ఫానే చూద్దాం'' అని మొదలెట్టేడు సియావో. 'గాడిదలీ' అనేమాట నోటిదాకా వచ్చిందిగాని తమాయించుకుని అసలుపేరేచెప్పేడు. ఆ పేరు వినగానే గాడిదలీ ఆశ్చర్యపోయేడు. అతన్ని అసలుపేరుతో ఎవరన్నా పిలిచి ఎన్నాళ్లయిందో ! టీమ్ లీడర్ సియావో తనని అసలుపేరుతో పిల్చేడు. ఎనిమిదవ దళ సైన్యం అధికారి తనని ఓ మనిషిగా చూసినందుకు ఉబ్బితబ్బిబ్బయేడు. అతని పెళ్లాం లేచిపోయిన దగ్గరనుంచి ఆత్మాభిమానం చంపుకుని వ్యసనాలకి బానిసయేడు. అట్టడుగుకి దిగజారిపోయేడు. అలాంటి వాడినసలుపేరుతో పిలవడమా ? అతను సియావో చెప్పేదంతా శ్రద్ధగా విన్నాడు.

"లీ-ఫా ఈ వూళ్లోకి వచ్చినపుడు అతనూ రైతు లందరిలాగే చాలా మంచి వాడు. కాని అతను కామందుదగ్గర బూఁవి కౌలుకి తీసుకుని అప్పులపాలయేడు.

---

1. చైనాగోడ 2. దుష్టత్రయపు 'తు'

గాడిదలమ్మేసేడు. కొడుకు చచ్చిపోయేడు. భార్యని పోషించలేక పోవడంతో ఆమె లేచిపోయింది. ఇతనీవూరొచ్చిన మొదట్లో జూదమాడేడా?''

గాడిద లీ తలదించుకుని ఆలోచించేడు - తన గాడిదల గురించి, పిల్లాడి గురించి, పెళ్లాం గురించి, పెళ్లాం లేచిపోయిన మొదటి రాత్రి గురించి ఆలోచించేడు. ఓ సారి ఆకలి దహించుకుపోతుంటే ఓ కామందు చేలో జొన్నకంకి కోసి పట్టుబడి పోయేడు, రక్తం చిమ్మే వరకు అతన్ని కొట్టేరు, తెలివి తప్పేడు. కాని మనిషన్నవాడు ఎలాగో బతకాలిగదా, అందుకే జులాయిగాళ్ల తో చేరి జూదం పార్టీలు నడిపేడు. అందరూ తనని అసహ్యించుకునేవారు. కాని తనకి బాధలేదు—తనని తనే అసహ్యించుకుంటాడు. ఇప్పుడు సియావో తనని పేరుపెట్టి పిలిచేడు. అంటే అతను తనని అసహ్యించుకోవడంలేదన్న మాట.

సియావో మాట్లాడుతూనే వున్నాడు.

“మనంచేసిన తప్పులన్నీ కామందుల వల్ల జరిగినవే. ఇప్పుడు వాళ్లు పోయేరు మనం ఇక ముందుకి పోకపోతే, అందరూ మననే తప్పుపడతారు. కాలంమారింది. మనమూ మారాలి. ఇప్పుడు భూమి మనదే. అందుకని మనం బాగా పని చేసి, బాగా బతికి మంచివాళ్ల మవాలి. మీలో మీరు చర్చించుకోండి. నేను అవతల మీటింగుకి వెళ్లాలి'' అని ముగించి, ముసిలోళ్ల మీటింగుకి వెళ్ళేడు సియావో. ఎవరికీ కనబడకుండా గది బయట కూచున్నాడు.

ఓల్డ్‌సన్ మాటలు బయటకు వినిపిస్తున్నాయి.

“మనం పాత సంగం నించి కొత్త సంగానికి మారతాంటే అసలు రంగు బైటపడతాది.-సంద్రం దాటినపుడు ఎనిమిది అప్సరసల్నాగ[1]. మీరు ముసిలోల్లి యినా పాటుపడగల్రు. తాయి—కంగ్[2] ఎనభయి ఏళ్లప్పుడు ఎన్ రాజుకాడ మంచి పదవి సంపాయించుకున్నాడు. మరి మనం ఏభై ఏల్లకే ముసిలోల మవుతావాం? అసలు పెద్దోల్లే మంచీసెబ్బర సెప్పగలరు. సియావో బాబాయి నన్ను సలహా అడుగుతుంటాడు తెలుసా? నిన్న సొంచియా మీటింగులో గుర్రాలుంతే బళ్ళు

---

1. చైనీస్ జానపదసాహిత్యంలోని తావోయిజం తాలూకు ఎనిమిది మంది అప్సరసలు.

2. తాయికంగ్ క్రీస్తుపూర్వం 11వ శతాబ్దిలో వుండే స్వాములారు. చాలాకాలం ఎవరికీ తెలీకుండా వుండేవాడు. ఓ రోజు వెన్ చక్రవర్తి అతన్ని కల్సుకుని ప్రధానమంత్రిగా నియమించేడు. అతనికి మంత్రాలు, మాయలు, జ్యోతిష్యం తెల్సునని వినికిడి.

కావాలన్నా. కాని 'చూ' ఏటన్నాడు? గుర్రాలుంటే గానగుండాలన్నాడు. సియావో బాబునాదే రైటన్నాడు. నాకున్న అనుభవం 'చు'కి వున్నాదేటి?...''

ఉపన్యాసం తప్పుదారి పట్టడం చూసి తీన్ తాత జోక్యంచేసుకుని "చైనా కమ్యూనిస్టు పార్టీ లేకుంటే మనం ఇలా వుండేవోల్లం కాదు. అంతా సెయిర్మన్ మావోకి రునపడి పోనాం. ఇక్కడెవరన్నా పార్టీని తిట్టే వోల్లున్నారా ?'' అని అడిగేడు.

తల పండిపోయిన ముసలామె పైపు తీసి 'అందరం మావోబాబుకి రునపడి పోనాం—మునుపు కుండడుగున గెంజికూడా వుండీదికాదు. ఉప్పుడు పే దోడు బాగా బతికీగల్డు. అందరం సెయ్యగల్గింది సేయాల'' అంది.

ఓ ముసలతను ఆమెకి అడ్డుతగిలి "అందరికి సెప్పేబదులు నువ్వే సెయ్య రాదా ? కిందటేడు నీ కొడుకు సైన్యంలో సేరతానంతే ఎనక్కుంచాలని సూసినావు కదా ?" అని అడిగేడు.

"అబద్ధం. నానాన్ని వుంచీనేదు. నా గురించి బెంగెట్టుకోకని సెప్పేను. మంచి సైనికుడవవమని సెప్పేను. బుగతల్ని, ఆల్లతొత్తుల్ని వొగ్గీకని సెప్పేను. ఆల్లని కాసుకోని బాగా పని సెయ్యాలని సెబితేని !"

"మాటలు నేర్సిన కుక్క వుస్కో అంటే వుస్కో అన్నాదట !"

అతనావిడని మరీ బాధ పెడుతున్నాడనిపించి సియావో ముందుకొచ్చి,

"నేనోమాట చెప్పేదా ? మిమ్మల్నిక్కడికి మీ సలహాల కోసం పిలిచేం. కావందుల్ని మట్టు పెట్టేం గనక మనమే యజమానులం ; మనమే పాలేళ్ళం. అందరికీ చెయ్యాల్సిన పని చాలా వుంది. ముసిలోళ్ళకి కూడా వుంది. ముసిలోళ్ళందరు కలిసి ఓలీగ్ పెడితే ఎలా వుంటుంది ? ఆ లీగ్ రైతుసంఘం ఆదేశాలను, కమ్యూనిస్టు పార్టీ ఆదేశాలను పాటిస్తుంది. ఎవరన్నా మీటింగులకు రాక పోయినా, పనిచేయక పోయినా మిగిలిన వాళ్ళు అతన్ని తప్పు పట్టొచ్చు. మరి మీరంతా ఒప్పుకుంతారా ?"

"ఒప్పుకుంతాం !" అని ముక్త కంఠంతో జవాబిచ్చేరు. వాళ్ళు పొద్దుతిరుగుడు గింజలు ఒలవడం ఆపి, లీగ్ గురించి మాట్లాడేరు. సియావోకి వాంగ్ భార్య గుర్తొచ్చి ఓల్డ్‌సన్‌ని అడిగేడు. ఓల్డ్‌సన్ అందరినీ పరకాయించి చూసి "నేదు, అదెందు కొత్తాది ? అదో ఎండుమాను. కదల్నేదు" అన్నాడు.

మీటింగు అయిపోయేక సియావో, కువో వాంగ్ భార్య ఇంటికెళ్ళేరు. ఆమె తూర్పు గదిలో కాంగ్ మీద కూచుని చిరుగులు కుట్టు కుంటోంది. అతుకులేసిన నీలం గౌను తొడుక్కుని కళ్ళద్దాలు పెట్టుకుంది. వీళ్ళను చూసి, తప్పదు కాబట్టి కాంగ్ మీద జాగా ఇచ్చింది.

వాళ్ళని ఆహ్వానించలేదు, పనిచేసుకుంటూనే వుంది. సియావో, కువో కాంగ్ మీద కూచున్నారు. కువో ఆమెతో కత్తు కలిపి ఏదో మాట్లాడుతున్నాడు.

సియావో కాంగ్ పరిశీలించేడు. దానిమీద చాప చిరిగి పోయింది. చిన్నబల్లకి ఓ కాలు లేదు. రెండు పాత పువ్వుల దుప్పట్లు మాసి, చిరిగి పోయేయి. కాంగ్‌కి అటు వైపు ముప్ఫై ఏళ్ళమనిషి కూచున్నాడు. అతనే పెళ్ళికాని కొడుకై వుంటాడు. అతను నిద్ర పోతున్నట్టు నటిస్తున్నాడు. ఉత్తరాన వున్న కాంగ్ దీనికి భిన్నంగా వుంది. దాని మీద కొత్తచాప, పక్కన అద్దాల బీరువా, దాన్లో అందమైన కొత్త దుప్పట్లు, దిళ్ళువున్నాయి.

కువో పైపు నింపుకుంటూ "నీ కోడలేది?" అనడిగేడు.

"ఎవులికెరిక ?"

ఇంతలో ఇరవై ఏళ్ళ యువతి నీలం గౌను తొడుక్కుని గదిలో కొచ్చింది. ఆమెది వెండి రింగుల నల్లటి జుట్టు అవడం వలన చెవులపైమెరుస్తున్నాయి. అతి థుల్ని పలకరించలేదు గాని పళ్ళుబిగించింది. వాంగ్ భార్య ఆమె మీద విరుచుకు పడి,

"పందుల్నెవరి కొగ్గేసి పోనావే సంజకానా ? నీ మొగానికి సికార్లే తక్కువ" అని తిట్టి పోసింది.

"నువ్వింటోనే వున్నావుకాదా" అని లెక్కలేకుండా పక్కగదిలోకి వెళ్లి పోయింది. దాంతో చిర్రెత్తిన అత్త

''కాలంవెంత మారిపోనాదే! నాకే ఎదురు సెప్తావా!'' అని అరిచింది.

కొత్తకోడలు బట్టలు మార్చుకుని, పందులకి కుడితి పెట్టడానికి పోతూ ''అవునే, కాలం మారిపోనాది!'' అంది.

'ఇదిన్నావా సియావోబాబూ?'' అంటూ శివాలెత్తినట్టు అరవ సాగింది. అత్తా కోడళ్లకు మాట మీద మాట పెరిగింది. అప్పుడు కొడుకులేచి "ఉప్పుడేటైనా దమ్మా? దాన్నొగ్గిరాదా?" అని మందలించేడు.

సియావో, కువో కూడా తగువు చంపేందుకు నాలుగు మాటలని, పెర ట్లోకి నడిచేరు. అక్కడ ఓ సైనికుడి తండ్రి 'లు' కనిపించేడు. అతను పడమట వున్న వాళ్లింటికి తీసుకుపోయి, పైపుకాలుస్తూ వాంగు భార్యకథంతా చెప్పేడు.

"వాంగ్‌భార్య రెండో కొడుకు చెప్పులు కుడతాడు. అతను కొంత డబ్బు వెన కేసుకొని ఓ పెద్దరైతుకూతుర్ని పెళ్లి చేసుకున్నాడు. కాని పెద్దకొడుకు పెళ్లిపెటా కులు లేకుండా వుండిపోయేడు. తల్లికి అదోసమస్య అయిపోయి, తెగ బాధ పడింది. పెద్దకొడుకు కష్టజీవి, నిజాయితీ పరుడు. కాని కొంచెం నత్తి. డబ్బు కూడా ఏవీ వెనకేయ లేదు. తల్లి అతనికి ఎన్నో సంబంధాలు చూసింది గాని ఏదీ కుదరలేదు. భూసంస్కరణ రోజుల్లో 'లీ' అనే పెద్దరైతు తన ఆస్తి కూడా పార్టీ జప్తు చేస్తుం దనే భయంతో, పేద అల్లుడైతే తనకు రక్షణగా వుంటుందని తన కూతురిని వాంగ్ పెద్ద కొడుక్కి యిస్తానన్నాడు. తాంబూలాలు కూడా పుచ్చుకున్నారు. ఇంతలో 'లీ'కి భయం తగ్గింది. పెద్దరైతుల్ని భూస్వాముల్లా చూడబోరని, వాళ్ల ఆస్తులు

పూర్తిగా జప్తు చేసుకోరనీ తెలిసేక "ఈ సంబంధం ఎందుకొప్పుకున్నానురా భగవంతుడా!" అని బాధపడ్డాడు 'లీ'. ఓ రోజు వాంగు భార్య 'లీ'కి బహుమానంగా రగ్గు పంపింది. వాళ్లు దాన్ని తిప్పి కొట్టి, దుప్పటి కావాలన్నారు. దుప్పటి కన్నా రగ్గే మెరుగు. అయినా రగ్గుని తిప్పికొట్టేరంటే 'లీ' కుటుంబానికి యీ సంబంధం యిష్టం లేదన్న మాటే. దాంతో వాంగ్ భార్య రెచ్చిపోయింది. అందుకే ఆమె సియావో, కువో కూడా వున్నా దిక్కు తోచనట్లు కూచుని, కోడలు రాగానే ఆమెతో కీచులాడింది.

సియావో, కువో ఆఫీసుకి తిరిగి వెళుతూ వాంగ్ భార్యకో దుప్పటి పంపాలని నిశ్చయించుకున్నారు. దానికి ముందు ధర కట్టి, తర్వాత కాంవందుల ఆస్తులు పంచేటప్పుడు ఆమె వాటాలో దీన్ని తగ్గించ వచ్చునని అనుకున్నారు.

సైనికుడొకడు దుప్పటి తీసుకు పోయి యిస్తే ఆమె పొంగిపోయి "రైతు సంగం అందరి బాదలు పట్టించుకుంటాది. పాత రోజుల కన్నా యీ కాలమే సయం" అని అందరితోను చెప్పింది.

దుప్పటి లీ ఇంటికి పంపి, సియావోతో మాట్లాడేందుకు రైతు సంఘం ఆఫీసుకి వెళ్ళింది. సియావో గాడిదలీ తో మాట్లాడుతున్నాడు.

గాడిద లీ బొంగురు గొంతుతో

"కాంగ్ మీదికి సాపలల్లగలను గాని, జులాయిగాల్లకి లీడరై పోగల్దునా? నాను సవ్వనూ?" అన్నాడు.

"నువ్వో చిన్న గ్రూపుకి లీడరుగా పనిచేయగలవు. అదెందుకు కుదరదు?" అనడిగేడు సియావో, అతనిలో ఆత్మ విశ్వాసం కలిగిస్తూ.

"నా రోజులు బాగానేవు. నానందరికీ సెడ్డోన్ని"

"నువ్ బాగా పనిచేస్తే ఆ దశంతా మారిపోతుంది ఏంవంటావ్?"

గాడిదలీ ఏదో చెప్పబోతున్నట్లున్నాడు. అది గమనించి సియావో ఆగేడు. అటు యిటు చూసి రహస్యంగా,

"నాకాడ తాంగ్* ఐదు సంచులు దాసుకున్నాడు." నువ్ పేదోడివి. నిన్నెవులూ అనుమానించరు. నువ్ నాకివ్వుడు సాయంసేస్తే నాన్నీకు తర్వాత సాయం సేస్తా "నన్నాడు. కాని బాబూ నువ్ నిన్న సెప్పిందంతా ఇన్నా. నా గుండె కరిగిపోనాది. నానూ పేదోన్నే ఇక యీ రహస్యందాచనేక నీతో సెప్పేను. నేప్పొతే మల్లి నీ ముకం సూడగల్దునా? పారిటీనే దగాసెయ్యనా?" అన్నాడు.

"మంచి పనిచేసేవ్. దీనివల్ల నువ్ రైతుసంఘం మనిషివనిపించు కున్నావ్" అంటూ అతని భుజం తట్టేడు సియావో.

---

*దుష్టత్రయంలోని తాంగ్ (అను.)

"నువ్వు పేదోడివి కదా, మరి బుగత కెందుకు సాయంసేసేవ్?" అనడిగేడు కువో.

"నానా పని సేయకుంటే మీకు సెప్పను ఏటుండేది?" అని ప్రశ్నించేడు గాడిదలీ.

సియావో పకపక నవ్వి, "నువ్ చెప్పిందీ నిజఁవేఁ. నువ్ వాడికి సాయం చేయకపోతే మాకు చెయ్యడానికి ఏఁవీఁ వుండేదికాదు. నీకు వీలైనపుడు ఆ సంచు లుతే. తొందరలో ఓ గ్రూపు తయారుచేసి వుత్పత్తి మొదలెట్టు. మళ్లీ కనిపించు" అని పంపేసేడు.

అతను వెళ్లిపోయేక వాంగ్ భార్యని "ఏఁవిఁలా వచ్చేరు? మళ్లీ లీ కుటుంబం ఏఁమన్నా గొడవ పెడుతోందా?" అని పరామర్శించేడు.

[illegible]గ్ భార్య తల అడ్డంగా తిప్పి, సియావో చొక్కా పట్టుకుని అతన్ని బైట గ[illegible]కి తీసుకుపోయింది. నెమ్మదిగా అతని చెవిలో రహస్యం వూదింది. తర్వాత న[illegible]ం హెచ్చించి "అడు మా దూరపు సుట్టం. మునుపు నాకు బయ్యం, అందుకనే [illegible]ప్పనేదు. అడక్కడ ఏడాదిగా దాక్కున్నాడు" అంది.

సియావో ఎవరన్నా వింటున్నారేమోనని కిటికీలోంచి బయటకు చూసేడు. ఎవరూలేరు, అయినా ఎక్కువసేపు ఆవిడ నక్కడ మాట్లాడనివ్వడం మంచిది కాదని పంపే సేడు. లోపలికొచ్చి కువోకి అంతా చెప్పేడు.

"ఈ వూరివాళ్లు కొంతమంది యీ కేసులో వున్నారు. అతన్ని అరెస్టుచేసి తీరాల్సిందే. అంతా బాగా తెల్సిన ఇద్దరు వెళ్లాలి. నువ్వు పోతే మంచిది. నీకూడా ఎవరిని తీసుకు వెళతావ్? చాంగ్ చింగ్–షీ ఇక్కడ సెక్యూరిటీ పని చూడాలి. కాబట్టి అతను లాభంలేదు. 'చు' ఒకోసారి బుర్రలేకుండా ప్రవర్తిస్తాడు, పైగా తుపాకి పేల్చలేదు కూడా. కాబట్టి అతనూ లాభంలేదు. ఇంకెవరున్నారంటావ్?" అని అడిగేడు.

"పాయి సెలవుమీదున్నాడుగదా, ఇలాంటిపని అతను బాగాసేత్తాడు'' అన్నాడు కువో.

''పాయి పోగలిగితే మంచిదే. కాని అతను సంవత్సరాది శలవులు భార్యతో గడిపేందుకొచ్చేడు. ఒస్తాడంటావా ? అయినా అతన్నిపిల్చుకురా, ముగ్గురం మాట్లాడుకుందాం. మనం త్వరగా యీపని పూర్తిచేయకపోతే యీలోగా బైటికి సంగతి పొక్కగలదు'' అన్నాడు సియావో.

తెల్లవారుతూండగా ముగ్గురు ఒక నిర్ణయానికొచ్చేరు. కువో, పాయి సామాన్లు సర్దుకున్నారు. రోడ్డుపర్మిట్, సిఫారసు వుత్తరం, ప్రయాణానికి కొంతడబ్బు పార్టీ

(మిగతా ప్రక్క పేజీలో)

## విలువలు

శరత్

రెండు అణువులు ఘర్షణ పడితే
వేడి ఉదయిస్తుందని కనిపెట్టిన
ఆది మానవుడు
ఎంత గొప్ప శాస్త్రజ్ఞుడో!
నువ్వు అతణ్ని గౌరవించవు!

ఆ అగ్నిని ఆధునికంగా మలచిన
విద్యుత్ సౌకర్యాలను
నలుగురంటే నలుగురే
సొంతసొమ్ము చేసుకుని
సుఖాల్ని దోచుకుంటున్నారు మరి!
నువు వాళ్ళను నిరసించవు!

మాంసం తినడం నేర్చి
రాళ్ళకంటె ఈటెల్తో కొడితే
జంతువు తేలిగ్గా చస్తుందని
బ్రతక నేర్చిన కష్టజీవి
ఎంత గొప్ప మేధావో!
నువు అతడ్ని గుర్తించవు!

ఆ ఆత్మ రక్షణాయుధాన్ని
మారణాయుధంగా మలచి
గుప్పిట్లో పెట్టుకొని
ఆస్తిపాస్తులకి "తాళాలు"గ
మార్చుకున్నారు మరి!
నువు వాళ్ళను గర్హించవు

---

ఇచ్చింది. జిల్లాకేంద్రంలో పబ్లిక్ సెక్యూరిటీవాళ్లకి ఉత్తరం రాసి మరికొంతమందిని వీళ్లకూడా పంపమన్నాడు.

కుమో, పాయి రెండు 99 ఎం. ఎం. రైఫిళ్లు తీసుకుని స్లెడ్జిమీద బయల్దేరేరు. జిల్లాకేంద్రంవరకు స్లెడ్జిమీదపోయి, అక్కడినుండి రైల్లో కిరిన్ రాష్ట్రంలోని యుషు జిల్లాకి పోయి, అక్కడ ఒకతన్ని అరెస్టుచేయాలని పథకం.

(ఇంకా వుంది)

* * * *

---

# రిమైండర్

**అజ్ఞాతసూరీడు**

1

ఓ చీకటి తెల్లవారు ఝామున, వెలుగును చూస్తే భయపడే ఆ ఖాకీ గుడ్డల పెద్ద మనుష్యులు, వ్యాన్‌తో ఆ రైలు పట్టాల ప్రక్కన ఆగారు. చితికిపోయి రక్తం ఓడుతున్న నాలుగు మాంసం ముద్దల్లాంటి శరీరాల్ని, ఆ రైలు కట్టక్రింద గోతులు తీసి పాతి పెట్టారు. తన వాళ్ళెవరూ చూడకుండా ఆ శవాల్లోని ఓ చేతికివున్న గడియారాన్ని దొంగిలించి దాచేసుకున్నాడో ఖాకీమనిషి, మట్టి కప్పబోయేముందు చివరిసారిగా. వెలుగు వచ్చేసరికి వ్యాన్ నగరం నాగరికతల్లోకి సర్రున జారుకుంటూ పారిపోయింది.

2

రైలు పట్టాల కిరువైపులా విస్తరించివున్న చిట్టడివి, ఆ నాలుగు బొందల్ని చూసి నిశ్శబ్దంగా నిట్టూర్చింది. వేల మందితో కిటకిటలాడుతూ డీసెల్ రైళ్ళూ, ఎక్స్‌ప్రెస్‌లూ ఆ పట్టాల మీదుగా పరుగులు తీస్తూనే వుంటాయ్. "ఒక్కసారి ఆగి చూడండర్రా" అంటూ ప్రతిరైలు వచ్చినప్పుడూ గింజుకుంటూ ఘోషిస్తుంది చిట్టడివి. కానీ ఆ ఘోష జనానికి వినపడనంత శబ్దం చేస్తూ, వేగంగా పరుగులు తీస్తాయక్కడ పట్టాల మీద రైళ్ళు. రాక్షసత్వం కట్టిన "తెట్టు" క్రింద రహస్యంగా నొక్కి వేయబడ్డాయ్ నాలుగు బంగారు కలలు అక్కడ.

3

వాళ్ళ నలుగుర్లోని నిజాయితీని కలుషిత పరిచేందుకు ఖాకీ మనుష్యులు 'ఆశల ఎంపైర్‌స్టేట్ బిల్డింగ్స్' ను వాళ్ళ ముందు నిలబెట్టారు. వాళ్ళ శరీరాల్లోని సత్యాన్ని వెలికి లాగడానికి బాయ్‌నెట్లను బర్మాల్లా ఉపయోగించారు. లాఠీలు సత్యాన్వేషణకు పూనుకుని, ఎదురు తిరిగిన ఎముకల్ని ఫెళఫెళా విరిచేశాయి. చిత్రహింసల శిబిరంలో చావు చివరి నిమిషాల్లో వాళ్ళు నిశ్శబ్దంగా ఒకరి కళ్ళల్లోకి మరొకరు చూసుకున్నారు. ఆ చూపుల్లో ప్రసారమైన భావం, "అంతా భరించండి ప్రజలకోసం; అన్నీ వదిలేద్దాం ప్రజలకోసం"

4

వీళ్ళను గురించి పాటలూ లేవు, పద్యాలూ లేవు. సంకుచితత్వంచే గొంతు నులమబడ్డ కళాకారులు, ఈ నాలుగు త్యాగాల మీదా సీత కన్నేశారు. అనుశాసన చీకటి దినాల నిశ్శబ్దతలో ఈ నాలుగు త్యాగాలూ రికామీగా మిగిలి పోయాయ్. ఓ పుంజీడు మంది కడుపు మండి వీళ్ళ గురించి వెర్రిగా లయలేని సంగీతాలు పాడినా, సాధికారత్వం లేని ఆ సంగీతం "చిరుగాలి సితారా రక్త చలన శ్రుతి" గీతాల్లో నమోదు కాలేక పోయింది.

5

ఇప్పుడు వెల్లి విరుస్తున్న విశాల దృక్పథమా !
వాళ్ళను ప్రజల్లో తిరిగి బ్రతికించు

*    *    *    *

[కామ్రేడ్స్ రత్నం సూర్యవర్మ, పాలడుగు రామకృష్ణ, తమలపాకుల బెన్నీ, మాలకొండయ్యలను 24-4-1976న నెల్లూరు జిల్లా ఏలూరుపాడు అడవుల్లో కాల్చి చంపి, తెట్టు వద్ద పాతి పెట్టారు పోలీసులు-]

*    *    *    *

(ఆరోపణ వంటి ఈ రిమైండర్‌కు కవి చిరునామా తెలియనందున సృజన ద్వారానే జవాబు చెప్పాల్సి వస్తున్నది. వీళ్లలో ఇద్దరు మృతవీరుల గురించి ఈ కవే రాసిన 'పాటలూ, పద్యాలూ' సృజన నవంబర్ 77 సంచికలో ప్రచురించింది. 'వాళ్లను ప్రజల్లో తిరిగి బతికించా'లనే ఆకాంక్షతోనే ఆ కవితలను మళ్లీ ప్రచురిస్తున్నాం. ఈ కవి ''చిరుగాలి సితారా రక్తచలన సంగీతశ్రుతి'' గా ధ్వనించిన సృజన 100 వ సంచికలో ఎన్నిక చేసి వేసిన కవితల్లో ఈ కవే మావో మీద రాసింది తప్ప స్మృతిగీతాలు లేవు. 'అను శాసన చీకటిదినాల నిశ్శబ్దత'ను ఛేదించి వాస్తవాలను బయటపెట్టాలని పౌరహక్కులసంఘం, విరసం, సృజన ప్రయత్నించి నపుడు 'ఈ నాలుగుత్యాగాలూ' వేరుగా చూడబడలేదని మాత్రం ఈ కవికి రిమైండ్ చేయదల్చుకున్నాం. ఈ సమస్య దృక్పథానికి సంబంధించింది కాదు, దృక్పథాల గురించిన అవగాహనకు సంబంధించింది అని స్పష్టం చేస్తూ 4, 5ల లోని ధ్వనితో విభేదిస్తూ సృజన ఈ రచనను ప్రచురిస్తున్నది. — 'సాహితీ మిత్రులు')

రెండు స్మృతి గీతాలు :

## ఎర్రమందారం !

నాకా విషయం బాగా తెలుసు
నిశీథి నిశ్శబ్ద సంఘర్షణలో
పారిన నెత్తుట్లో నువ్వు
నువ్వు ఎర్ర మందారానివై పూచిన రోజుకి-
నీకు నిండా పద్దెనిమిది
వసంతాలు రాలేదు

కనీసం మీసాలైనా రాలేదు!
సిద్ధాంత గ్రంథాలన్నీ
పుక్కిట పట్టేసి
సంకుచితత్వపు
సరిహద్దు గీతల్లో బ్రతికే
మేధావిత్వ ప్రకర్షా రాలేదు—
తల పండిపోయిన
ఆశయాలుడిగి పోయిన
ఏ ముప్పయ్యేళ్ళ
రాజకీయానుభవమూ నీకు రాలేదు—
కానీ—
నమ్మిన దాన్ని ఆచరణలో
రుజువు చేసుకునే చిత్తశుద్ధి
అందుకోసం బలై పోయే
నిజాయితీ మాత్రం నీకు వచ్చాయనే—
ఆ విషయం నాకు బాగా తెలుసు!

(ప్రకాశం జిల్లా లెట్టు సమీపారణ్యంలో అసత్య సంఘర్షణలో అమరుడైన కామ్రేడ్ పాలడుగు రామకృష్ణ అరుణారుణ స్మృతికి—)

## ప్రేమ ప్రజల్ని ప్రేమిస్తుంది!

అమ్మ నాన్నను ప్రేమిస్తుంది!
అబ్బాయి అమ్మాయిని ప్రేమిస్తాడు
ఆవు దూడను ప్రేమిస్తుంది!
కవిగారు కవితల్ని ప్రేమిస్తాడు
నటుడు తన్ను తానే ప్రేమించు కుంటాడు
పాలకులు అధికారాన్ని ప్రేమిస్తారు!
పోలీసులు హింసను ప్రేమిస్తారు!
జడ్జిగారు దొంగ సాక్ష్యాలను ప్రేమిస్తారు!
కానీ—

(మిగతా ప్రక్క పేజీలో)

# కవిత్వం—శాస్త్రీయ విమర్శ

త్రిపురనేని మధుసూదనరావు

"అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః
యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే
శృంగారీ చేత్కవిః కావ్యే జాతం రసమయం జగత్
స ఏవ వీతరాగశ్చేత్ నీరసం సర్వమేవ తత్
భావాన చేతనానపి చేతన వ చ్చేతనా నచ్య చేతనవత్
వ్యవహారయతి యధేష్టం సుకవిః కావ్యే స్వతంత్రతయా"

—ఆనంద వర్ధనుడు

అపారమైన కావ్య ప్రపంచానికి కవి సృష్టికర్త. కవి తన ఇష్టం వచ్చినట్టు లోకాన్ని మారుస్తాడు. కవి శృంగారి అయితే లోకాన్ని శృంగారమయం చేస్తాడు. కవి విరాగైతే లోకాన్ని నీరసం చేస్తాడు. అచేతన వస్తువుల్ని చేతన వస్తువులుగా చేతనవస్తువుల్ని అచేతనవస్తువులుగా వ్యవహరింప చేసే స్వేచ్ఛని కవి తీసుకుంటాడు. ఇది కవిని గురించీ కవిత్వాన్ని గురించీ ఆనంద వర్ధనుడనే ప్రాచీన విమర్శకుడు చెప్పిన విషయం. వేదకాలంనుంచీ కవిని గురించీ కవిత్వాన్ని గురించీ చెప్పిన విషయాల్ని ఆనంద వర్ధనుడు ఈ వాక్యా ల్లో చెప్పాడు. దీన్ని ఆధారంగా చేసుకొని సంప్రదాయవిమర్శనను గురించి పరి శీలించవచ్చు. కవి బ్రహ్మవంటివాడు. బ్రహ్మ ఏ విధంగా ప్రపంచాన్ని సృష్టిస్తాడో కవి అలాగే కావ్య ప్రపంచాన్ని సృష్టిస్తాడు. ఇంకా కాస్త సంప్రదాయికంగా చెప్పా లంటే బ్రహ్మ అపూర్వాన్ని కల్పన చేయలేడు. పూర్వ పూర్వ జన్మల్లో మనుషులు చేసే పాపపుణ్యాల్నిబట్టి లోకపద్ధతి ప్రకారం బ్రహ్మసృష్టి జరుగుతుంది. కవి సృష్టికి ఆ బాధ్యతకూడా లేదు. కావ్యసృష్టికి కవికి ప్రేరణఏమిటి? కవి స్వయం ప్రేరకుడు. కావ్యసృష్టికి కవిమాత్రమే కారణం అంటే ఇతర ప్రేరణలతో కవికి పని ఏముం

---

నువ్వు మాత్రం!
ప్రకృతి నియమాలనే ధిక్కరించి
ఆడంబర హీనమైన
నిశ్శబ్దతలో
ప్రజలందర్నీ ప్రేమించావు

(చెట్టు వద్ద పోలీసులచే కాల్చి చంపబడ్డ భిలాయ్ ఉక్కు కర్మాగారం కార్మి కుడు కామ్రేడ్ మాల కొండయ్య ఎర్రని జ్ఞాపకం కోసం)

— అజ్ఞాత సూరీడు

టుంది? స్వయంప్రేరణ అంటేఏమిటి? ప్రతిభ. కవికి ప్రతిభ అనేగుణం లేకపోతే శక్తి వుంటుంది. ఇదే కవి కావ్యసృష్టి చేయగలగటానికి మూలం. ప్రతిభ కవిత్వబీజము. ఇది కవికి పూర్వజన్మ ఫలితం. అందుకనే కొందరుమాత్రమే కవిత్వాన్ని సృష్టింప గలరు. దైవానుగ్రహమువలన, తపస్సు వలన కొద్దిమంది మాత్రమే "ప్రతిభావంతు" లవుతారు. అట్టి ప్రతిభావంతులే దివ్యదృష్టితో (క్రాంతదర్శనము) కావ్యసృష్టి చేస్తారు. కాబట్టి మనుషులందరూ కవిత్వం రాయలేరు. చెప్పలేరు. ప్రత్యేక లక్షణాలు శక్తిగల వ్యక్తులే కవిత్వాన్ని సృష్టిస్తారు,

కవిత్వం రసప్రధానం. ఈ రసం కవిత్వానికి ఆత్మ. మనిషి ఆత్మ ఆనంద స్వరూపం. కావ్యపఠనంవల్ల మాయావరణం ఒక క్షణం మంచులా కరిగిపోయి మనిషి ఆత్మ రసాన్ని అనుభవిస్తుంది. అలాంటి అనుభవం పొందేవాడు సహృదయుడు. ఈ సహృదయుడికి వాసనలు వుంటాయి. కావ్య, నాటకఅధ్యయనం వల్ల హృదయంలో బాహ్యవిషయజ్ఞానం పోతుంది. హృదయం అద్దంలావున్నప్పుడు రసం అభివ్యక్తం అవుతుంది. కాబట్టి కవిలాగా చదివేవాడికి కూడా కొన్ని ప్రత్యేక లక్షణాలూ యోగ్యతా వుండాలి. "మూలంబీజ స్థానీయాత కవిగతోరసః కవిరిహ సామాజికతుల్య ఏవ" అంటూ కవిలో సామాజికునిలో కూడా ప్రతిభ అనే శక్తి వుండాలని అభినవగుప్తుడనే వ్యాఖ్యాత 'అభినవభారతి'లో చెప్పాడు. అంటే కవిత్వం కవికీ సహృదయుడికీ సంబంధించిన వ్యవహారం. ఈ ప్రతిభవల్లనే సహృదయుడు కవిత్వంతో సాధారణీకరణం పొందుతాడు. ఆ క్షణంలో వాసనాక్షయం జరిగి ఆత్మానందం పొందుతాడు. ఈ ఆనందం అలౌకికం. అంటే లోకాతీతం. ఎందుకనంటే లోకంలో శోకం శోకమే. కావ్యంలో శోకం నుంచి కూడా ఆనందమే పొందుతాం. ఈ రసానందం బ్రహ్మానంద సహోదరం అంటేఅర్థం ఇదే. ఇది స్థూలంగా సంప్రదాయికవిమర్శ. ఈవిమర్శమీద వేదాంత, ధర్మశాస్త్రాల ప్రభావం వుంది. ఇది కేవలం శుద్ధకళావాదంగా పైకి కనిపించినా రాజును దివ్యాంశ సంభూతుడుగా చిత్రించటం, ఆత్మకు ప్రాధాన్యం ఇచ్చిశరీరాన్ని తక్కువచూపు చూడటంలో దీని వర్గస్వభావం కనిపిస్తూనేవుంది. శ్రమజీవుల మీద చిన్నచూపు చూడటమే, విశ్రాంతి వర్గాన్ని ఆకాశానికి ఎత్తటమే ఆత్మను గొప్పగా వర్ణించటానికి శరీరాన్ని శరీరప్రవృత్తుల్ని నీచంగా చిత్రించటానికీ కారణం. సమాజంలో మార్పులువచ్చి శూద్రుల వంటి శ్రమజీవుల ప్రతిష్ఠ పెరగటంతో, వర్తకులూ చేతివృత్తుల వాళ్ళ ఏర్పడి నగరజీవితం రావటంతో కాయశుద్ధిని గురించి చెపుతూ శరీరాన్ని బ్రహ్మపురి అన్నారు. భక్తి వుద్యమకాలంలో సంప్రదాయిక కవిత్వ విమర్శలో కూడా కొద్దిగా మార్పువచ్చింది. రస, ధ్వని సిద్ధాంతాల ఆర్భాటమేకాని ఒక కావ్యాన్ని తీసుకుని పూర్తిగా రస సిద్ధాంతాన్ని కానీ ధ్వని సిద్ధాంతాన్ని కానీ అన్వయించటం జరగలేదు. ఏవో కొన్ని పద్యాల్లో మట్టుకే అన్వయించటం మాత్రమే జరిగింది.

ఆధునిక యుగంలోకానీ ప్రబంధయుగంలో కానీ రససిద్ధాంతంవంటి సంప్రదాయిక విమర్శనను సక్రమంగా అన్వయించిన వాళ్ళు అసలులేరు. మనుచరిత్రలోనూ, ఆముక్తమాల్యదలోనూ, క్షేత్రమాహాత్మ్య కావ్యాల్లోనూ రసనిర్ణయం చేయలేక నానాతంటాలు పడ్డారు. ఆధునికయుగంలోని కవిత్వానికి అన్వయించటంలో సంప్రదాయ విమర్శకులు పూర్తిగా విఫలం అయ్యారు. 'రసవంతంగావుంది' అని చప్పరించటంతో కాలక్షేపం చేస్తున్నారు. కన్యాశుల్కంలో రసం ఏమిటి? మాలపల్లిలో రసం ఏమిటి? మహాప్రస్థానంలో రసం ఏమిటి? తెల్లమొఖం వేయవలసిందే? లేకపోతే రస సిద్ధాంతంపట్టటం లేదుకనుక వీటిని సాహిత్యం కాదనే స్థితికి దిగజారటం జరిగింది, జరుగుతోంది. ప్రాచీన కాలంలో కానీ ఆధునిక యుగంలో కానీ సంప్రదాయ విమర్శనం తెలుగు కవిత్వానికి చేసిన దోహదం అత్యల్పం.

అనుభూతి లేదా హృదయవాద విమర్శ భావకవులతో ప్రారంభం అయింది. దీన్నే సౌందర్యవాద విమర్శ అని కూడా అనవచ్చును. పాశ్చాత్యుల కళ కళ కోసమే, కవిత్వం అంటే కవి తన అనుభూతిని పాఠకునికి అందించటం, అందం ఆనందం కవిత్వ పరమావధి అని ఈ వాద సారాంశం. ఈ వాదం భారతీయ సంప్రదాయ వాద, పాశ్చాత్య కాల్పనికవాద విమర్శల సమ్మేళనమైన ఆధునిక విమర్శ అనవచ్చును. విజ్ఞానశాస్త్రం ప్రపంచాన్ని మిరుమిట్లు గొలుపుతున్న రోజుల్లో సాహిత్య కళారంగాన్ని చిన్నచూపు చూస్తున్న రోజుల్లో షెల్లీవంటి ఆంగ్లేయకవులు కవిత్వహక్కుల పునరుద్ధరణ వుద్యమం లేవదీసారు. కవిత్వం స్వతంత్ర ప్రతిపత్తి గల మంత్రమందిరం. కళ స్వశక్తి మీద జీవిస్తుంది. నీతి సూత్రాలకూ రాజకీయాలకూ వ్యతిరేకంగా వాటిని ధిక్కరిస్తూ వాటికి అతీతంగా కళ స్వతంత్ర రంగంగా వుంటుంది. ప్రాచీన సంప్రదాయంలోనే కళకు ఆనందం ప్రధాన ప్రయోజనం అనీ వుపదేశం ద్వితీయ ప్రయోజనం అనీ చెప్పటం జరిగింది. ఈ వాదం స్వతంత్ర ప్రతిపత్తితత్త్వం (autonomism) 'pure art' స్వచ్ఛకళ, 'form' శిల్పం వంటి అనేక రూపాల్లో వ్యక్తం అయింది. భావకవిత్వ యుగంలో అనుభూతి వాదం, సౌందర్యవాదం శిల్పవాదం ప్రబలంగా వున్నప్పటికీ అవి సంప్రదాయ విమర్శలో భాగంగానే కొనసాగాయి. ముఖ్యంగా విమర్శ పరిభాషను అలంకార శాస్త్రాల నుంచీ ఎక్కువగా గ్రహించటంవల్లా, విమర్శకులందరూ దాదాపు సంప్రదాయ పరులు కావటంవల్లా శిల్పవాదులు లేదా అనుభూతివాదులు కవిత్వవిమర్శలో మౌలికమైన మార్పు తీసుకురాలేకపోయారు. రాయప్రోలు 'రమ్యాలోకనం' ఆకారంలో ఆధునికంగా కనిపించినా సారాంశంలో సంప్రదాయాన్ని నిరాకరించలేదు. భావ కవిత్వంమీద తిరుగుబాటు చేసినవాళ్లు తమ విమర్శనాపద్ధతిని సమగ్రంగా వివరించలేదు. అధివాస్తవికత వంటి సిద్ధాం

తాల ప్రభావం కవిత్వం మీద వున్నంత కూడా విమర్శమీద పడలేదు. సందర్భాన్ని బట్టికవులే తమ కొత్త కవిత్వాన్ని సమర్థించుకోవటానికి విమర్శనలు రాసినా బల మైన ప్రభావం చేయలేకపోయారు.

అనుభూతివాదం ప్రభావం అభ్యుదయ విమర్శ మీద కూడావుంది. కవిత్వం సమాజ ప్రయోజనాన్ని నిర్వహించాలని గుర్తించినా, కవిత్వం ప్రజలకోసం అని అంగీకరించినా అభ్యుదయ విమర్శకులమీద కూడా అనుభూతి, హృదయం, శిల్పం వంటి భావనల ప్రభావం వుంది. కవిత్వంలో వస్తువును గురించివున్న స్పష్టతఅభ్యుదయ విమర్శకులకు శిల్ప విషయంలో లేదు. సంప్రదాయవాదుల్లా వీళ్ళు "కవిత్వానికి హృదయమే కేంద్రం" "కవిత్వానికి అనుభూతి జీవధాతువు" (రా.రా. సారస్వత వివేచన) అంటూ శిల్పవాద ప్రభావంలో పడ్డారు. పాలకవర్గ ఆదరణలో పండితులు రాసిన కవిత్వంతో పాటు ప్రజలు మౌఖికంగా చెప్పిన జానపద కవిత్వాన్ని విమర్శించేటప్పుడుకూడా విమర్శకులు రసం అనీ అనుభూతి అనీ బాగా అలవాటయి పోయిన విమర్శనా పద్ధతుల్నే అనుసరించారు. తాత్వికంగా అభ్యుదయ విమర్శ సంప్రదాయ పరిధినుంచివిముక్తం కాలేదు. పరిభాషను విమర్శకు ప్రత్యామ్నాయం చేశారు. తాత్త్విక పునాది లేకపోవటంతో సంప్రదాయవిమర్శను నిరాకరిస్తూ, హేళనచేస్తూ వక్రీకరిస్తూ కించపరుస్తూ కాలక్షేపం చేశారు.

ఇటీవల మళ్ళీ అనుభూతివాద, శుద్ధకళావాదవిమర్శ అనేక రూపాల్లో కనిపిస్తోంది. రోజురోజుకూ బలం పుంజుకుంటున్న సాహితీవరుత్ని నిలబెట్టి ప్రశ్నిస్తున్న శాస్త్రీయ విమర్శను అవగాహన చేసుకోలేనివాళ్ళూ, శాస్త్రాన్ని నిరాకరించే వాళ్ళూ సంప్రదాయాన్ని కొత్తవేషంతో నిలబెట్టడానికి ప్రయత్నం చేసేవాళ్ళూ అనుభూతి పేరుతో రంగ లోకి వస్తున్నారు. వీటిలో మొదటిది అనుభూతివాదం. విభిన్న కోణాలనుంచీ అనుభూతివాదాన్ని చెపుతున్న వాళ్ళు ఇస్మాయిల్, శ్రీకాంతశర్మ, శేషేంద్రశర్మ, ఆర్.యస్. సుదర్శనం. నలుగురూ నాలుగు దారులనుంచీ వొకే వాదాన్ని చేస్తున్నారు. వీళ్ళందరూ ముక్తకంఠంతో వ్యతిరేకిస్తున్నది రాజకీయాలకూ కవిత్వానికి సంబంధాన్ని, రాజకీయ పార్టీలకూ కవులకూ సంబంధాన్నీ. ఈ రూపంలో వీళ్ళు విప్లవ సాహిత్య వుద్యమం మీద దాడి చేస్తున్నారు. ఇస్మాయిల్ ఏమంటాడు? "శాస్త్రీయ విశ్లేషణకి జీవితం జీవితంగా లభ్యంకాదు. తాత్త్విక దృష్టి జీవితతాత్పర్యాన్ని చెపుతుంది కానీ అది జీవితం కాదు. అనుభవాన్ని అనుభవంగా అందించ గలిగేది సాహిత్యమే. అనుభవం పాఠకులకి అనుభూతం అయ్యేటట్టు చేస్తుంది. దీనివల్ల మనచైతన్య పరిధి విస్తరిస్తుంది. సాహిత్యం సామూహిక సృష్టికాదు. వ్యక్తి సృష్టివ్యక్తికి జీవితానికీ మధ్య సంయోగంనుంచీ ఇది పుడుతుంది. ఇది వైయక్తిక దర్శనం. ఎవని అనుభవం వానిది. ఈ అద్వంద్వత (Unique ness) కవిత్వానుభూతి మౌలిక లక్షణం. కవిత్వమనేది కవి సొంతమైన జీవితానుభవంలోంచి పుట్టుకు రావాల్సిందే. మరోమార్గం లేదు." శ్రీకాంతశర్మ అనుభూతివాదానికి

ఖచ్చితమైన వుదాహరణగా కాళిదాసు సొంతఅనుభూతిని చెప్పే ఈ శ్లోకాన్ని ఉటంకించాడు.

"రమ్యాణివీక్ష్య మధురాంశ్చనిశమ్యశబ్దాన్
పర్యుత్సుకోభవతి యత్సుఖితోప జంతుః
తచ్చేత సాస్మరతి నూనమబోధపూర్వం
భావస్థిరాణి జననాంతర సౌహృదాని"

హంసపదిక అనే ఆమె పాటను విని దుష్యంతుడు సుఖంగా వుండి కూడా మూగవేదన పడుతున్నాడు. ఆ వేదనకు దుష్యంతుడు ఇలా తనలోతాను కారణం చెప్పుకున్నాడు. మనిషి సుఖంగా వున్నప్పుడు కూడా శ్రావ్యమైన శబ్దం వినటంవల్లకానీ, సుందరమైన దృశ్యాన్ని చూడటంవల్లకానీ తనకు తెలియకుండా తన మనస్సులో వున్న పూర్వజన్మల బంధాలు స్మరణకు వస్తాయి. దుర్వాసుని శాపంతో శకుంతలను మరిచిపోయిన దుష్యంతుని మనస్సులోని అజ్ఞాతరతిని గురించి కాళిదాసు వ్యంగ్యంగా చెపుతున్న శ్లోకం ఇది. దీన్నే శ్రీకాంతశర్మ అనుభూతి అంటున్నాడు.

శాస్త్రం అయినా తత్త్వం అయినా సాహిత్యం అయినా జీవితాన్ని అర్థంచేసుకోవాటానికి ప్రయత్నంచేసే సాధనాలే. అన్ని కోణాలనుంచీ జీవితాన్ని పరిశీలిస్తేనే జీవిత అద్వంద్వతను మనం అర్థం చేసుకోగలుగుతాం. శాస్త్రీయ అవగాహనవల్ల కవికి జీవితానుభవ అవగాహన పరిపూర్ణం అవుతుంది. తత్త్వం కవిత్వంలో అలముకొని వుండే వస్తువు. అనుభవం కవికి సామాజిక జీవితం నుండే లభిస్తుంది. కవి అనుభవానికి మూలమైన ప్రత్యేక సమాజంలేదు. సామాజిక, సమష్టి జీవితం లేకపోతే కవికి అనుభవం వుండదు. వ్యక్తి సమూహంలో అవిభాజ్యమైన భాగం. వ్యక్తి సమష్టి ఫలితం. వ్యక్తి చారిత్రక క్రమ ఫలితం. ఆదిమ 'మంద' సమాజంలో వ్యక్తి వుండడు. వ్యక్తికీ జీవితానికీ మధ్య సంయోగం అంటే వ్యక్తికీ అతని చుట్టూవున్న వ్యక్తులకూ సంయోగం అనిఅర్థం. వ్యక్తులు పరస్పర సంబంధం లేకుండా వుండటానికి అవకాశం లేదు. అలాగే సంబంధాలు స్థలకాలవలన అధీనాలు. ఎవడి అనుభవం వాడిదికాదు. ఎవడి అనుభవం అయినా మరొకడితో నిర్దిష్ట సంబంధాల నుంచీ పుట్టవలసిందే. సామాజికస్వభావం లేని అనుభవం వుండదు. సమాజానికి అతీతంగా అనుభవం వుంటే సంయోగం ఎలాసాధ్యం. శూన్యంతోనా సంయోగం? తనతో తానే సంయోగం పెట్టుకుంటాడా? కవికి సొంతమైన జీవితానుభవం వుండదు. సొంతంగా (Subjective) చెప్పటంవుంటుంది. వాదంకోసం కవిత్వం వ్యక్తిసృష్టి అని అంగీకరించినా ఆ వ్యక్తి ఎవరు. ఒక నిర్దిష్ట సామాజిక దశలో, నిర్దిష్ట సామాజిక సంబంధాల్లో జీవించే వ్యక్తే. సామూహిక జీవితంలేకుండా 'వ్యక్తిసృష్టి' సాధ్యంకాదు. ఇంతకీ ఈ 'సృష్టి' ఏమిటి? కవి అందించే అనుభవం సామాజికం అయిందే. ఆ అనుభవంలో శాస్త్రం వుంటుంది. తత్త్వంవుంటుంది. నీతివుం

టుంది. రాజకీయాలు వుంటాయి. ఈ అనుభవంతో మనం అనుభూతి పొందడం శారీరకం. నాడీమండల సంచలనం, కళ్లమ్మట నీళ్లురావటం శారీరకమైన ప్రతిక్రియలే. కవిఅనుభవం కవి వర్గజీవితంనుంచే పొందుతాడు. వర్గాతీత అనుభవం కవికీవుండదు. ఎవడికీ వుండదు. మాలపల్లిలో బతికేవాడికి మాయాబజారులో బతికేవాడికీ అనుభవంలో తేడా లేదా? తన అనుభవానికి ఒక ప్రయోజనాన్ని నిర్దేశించుకోవటం చైతన్యవంతుడైన కవి చేసేపని. రాజపరివారంలో వున్న కవి అంతఃపుర, ఆస్థానపరిసరాల నుంచీ అనుభవాన్ని పొందుతాడు. శ్రామిక విప్లవసేనలో వున్న కవి విప్లవప్రజల జీవితంనుంచే అనుభవం పొందుతాడు. అద్వంద్వత అంటే అనుభవంలో అన్ని అంశాలూవుండటం. అంతే కానీ శాస్త్రానికీ తత్త్వానికీ వర్గాలకీ అతీతంగా వుండటం కాదు. ఇస్మాయిల్ చెప్పే అనుభవం, అనుభూతి, వైయక్తిక దర్శనం, వ్యక్తి సృష్టి, తననుతాను చేరుకోవటంవంటి భావనలు సంప్రదాయిక రససిద్ధాంతానికీ, జర్మన్ సౌందర్యవాదానికీ పుట్టిన సంతానం. ఆత్మవాదంలో విశ్రాంతి తీసుకోవటం. శ్రీకాంత శర్మ అనుభూతివాదానికి ప్రమాణంగా వుటంకించిన కాళిదాసు శ్లోకం ఆధునిక విజ్ఞాన శాస్త్రంతో పరిచయం వున్న వాళ్ళు సులభంగానే అర్థం చేసుకోవచ్చు. మెదడులో ప్రతిబింబించిన అనేక విషయాలు బాహ్యప్రపంచంలోని వస్తువులతో మాటలతో అనుబంధంలోకి వచ్చినప్పుడు స్మరణకు వస్తాయి. మన మెదడులో వున్నవి అన్నీ వున్నట్టు ప్రతిక్షణం ఎట్లాతెలుస్తుంది. ఎవడి మెదడుకు వాడే సాక్షికాలేడు. దీనికి పూర్వజన్మతో కలపటం కాళిదాసు చేస్తేచేశాడు. దీనికి శ్రీకాంతశర్మవ్యాఖ్యానంఏమిటి? ఈ అనుభూతివాదానికి రసాభివ్యక్తికీ తేడా ఏమిటి? దుష్యంతునిలో శకుంతలా సంబంధమైన విస్మృతరతిని వ్యంగ్యంగా చెపుతుంటే సందర్భంనుంచీ, కవి దృక్పథంనుంచీ విడదీసి చెప్పటాన్ని ఏమని పిలవాలి? ఇంతకీ ఇస్మాయిల్, శర్మ ఇద్దరూ ఈ అనుభూతి వాదాన్ని కవిత్వంలో రాజకీయాలనూ, రాజకీయపార్టీల ప్రమేయాన్ని నిరాకరించటానికి సాధనంగా వుపయోగించుకున్నారు? కవిత్వంలో ఏ రాజకీయాలను వీళ్ళు నిరాకరిస్తున్నారు? కమ్యూనిస్టురాజకీయాలను. ఏ పార్టీని వీళ్ళు నిందిస్తున్నారు? కమ్యూనిస్టు పార్టీని. ఇది ఇస్మాయిల్ స్పష్టంగా చెప్పాడు. ఏ ఇజానికీ కట్టుబడి వుండనవసరం లేదని శర్మ చెప్పాడు. ఒక్కమాటలో మార్క్సిస్టు తత్త్వాన్ని నిరాకరించటం వీళ్ళ ధ్యేయం. ఇదే పని ని గుంటూరు శేషేంద్రశర్మ, ఆర్.యస్. సుదర్శనం కూడా చేస్తున్నారు. శేషేంద్రశర్మ విమర్శకి పండితులు, సంప్రదాయాన్ని సమర్థించేవాళ్ళు మహానందపడి పోతున్నారు. మరో రూపంలో విశ్వనాథ సత్యనారాయణ దొరికాడని సంబరపడిపోతున్నారు. 57 లక్షణ గ్రంథాల నుంచీ కొటేషన్లు ఇచ్చాడని ఆశ్చర్యపడిపోతున్నారు. వాస్తవానికి శేషేంద్ర శర్మకి విమర్శలో ప్రాథమిక సూత్రాలు కూడా తెలియవు. వాగాడంబరం, వక్రీకరణలతో నిండిన దుష్టమైన అసహన

ఫలితమే శేషేంద్రశర్మ కవిసేన మేనిఫెస్టో. ఋగ్వేదం నుంచీ లెనిన్ దాకా అందరి కొటేషన్లనూ చారిత్రక దృష్టి లేకుండా ఉపయోగించుకున్నాడు. ప్రాచీన గ్రంథాల నుంచీ ఆధునిక గ్రంథాల నుంచీ వాటి కాలాన్ని కానీ, ఆ రచయితల, మేధావుల దృక్పథాన్ని కానీ పట్టించుకోకుండా తన సొంత అభిప్రాయానికి సమర్థనలుగా వాడుకోవటం చిత్తశుద్ధి లేని అపండితుల లక్షణం. పుస్తకాలు దగ్గర వుంటే కొటేషన్లు ఎవరైనా ఎన్ని కావాలంటే అన్ని ఇవ్వచ్చు. అభినవగుప్తుడికీ లెనిన్‌కీ తాత్విక దృక్పథంలో తేడా వుంటుందన్న ఇంగిత జ్ఞానం కూడా వుండనవసరం లేదా? మళ్ళీ తిట్లు- ఎవరిని? గురజాడ నుంచీ ఇవ్వాళ వరకూ వున్న అభ్యుదయ, విప్లవ కవులందరినీ ఏ ఒక్క శాస్త్రీయమైన కారణం చూపకుండా తిట్టిందే తిట్టటం. కాకపోతే విశ్వనాథకూ, కృష్ణశాస్త్రికీ దయ తలచి కితాబులిచ్చాడు. తనే తెలుగులో మొదటి కవి ననుకునేంత దురహంకారం ఎవరికీ ఆరోగ్యకరం కాదు. ఈయన కూడా రాజకీయ పార్టీల్ని తిట్టి పోశాడు. రాజకీయాలు కావాలట, రాజకీయ పార్టీలు వద్దట. ఎవరో కవిత్వంలో శిల్పం అవసరం లేదన్నారట. అందుకని ఈయన వస్తువే అవసరం లేదనేంత వరకు శిల్పవాదాన్ని సాగలాగాడు. సాహిత్యంలో సాహిత్య స్పృహ వుండటమే సామాజిక స్పృహ, సమాజానికి కవులే నాయకత్వం వహించాలి వంటి చిన్నపిల్లలు కూడా చేయని అపరిణత సూత్రీకరణలు లెక్క లేనన్ని చేశాడు. వ్యాధితో బాధ పడుతున్నాడు.

ఆర్. ఎస్. సుదర్శనం తత్త్వవేత్త, మేధావి, విమర్శకుడు, కవి, రచయిత అని అభ్యుదయ కవులతో కూడా ప్రస్తుతుల్ని అందుకుంటున్నాడు. విమర్శకుడుగా, రచయితగా అకాడమీ సత్కారాన్ని కూడా పొందాడు. కవిత్వం రాజకీయాలతో కలుషితం కాని గంగాజలంలా వుండాలనీ, అనుభూతి కవిత్వానికి ముఖ్యమనీ, సామాజిక స్పృహ అంటే కవి వ్యక్తిగా తన అనుభూతిని వ్యక్తం చేయటమే అని సుదర్శనం ప్రధాన సిద్ధాంతం. మార్క్సిస్టులకు మార్క్సిజం రాదని మార్క్సు తత్త్వాన్ని సహించవచ్చు కానీ లెనిన్ అభిప్రాయాలనూ, పార్టీలను కవులు సహించరాదనీ, ఈ నాటి వామపక్షకవులందరూ పార్టీలకు తొత్తులనీ ఈయన అభిప్రాయం. "ఈ నాడు ప్రజలభాషలో అసందిగ్ధంగా అందరికీ అర్థమయ్యేలా "సామాజిక స్పృహ"తో వ్రాయాలి అని ఘోషించటంలోని అంతరార్థం యిదే. రచనలోని సృజనాత్మకతను, వ్యంగ్యాన్ని నిలువునా ఖూనీ చెయ్యటం, సజీవమైన రచనని సహించలేక పోవటం" (జాగృతి, దీపావళి సంచిక) ఇక్కడ 'సామాజిక స్పృహ' అంటే రాజకీయ నాయకుని బుర్రతో ఆలోచించటం అట. "రచయిత అనుభూతి అతని హృదయంనుంచీ, నరాల నుంచీ, సంస్కారంనుంచీ వస్తుంది" "కాలంలో కరుడు కట్టుకుపోయే చారిత్రక బంధనాలనుంచీ మనిషికి విముక్తినికలిగించే చైతన్య స్ఫురణ, ప్రేరణ, స్పృహ సృజనాత్మక రచనలో వ్యంగ్యంగా అభివ్యక్తం కావడాన్నే సాహిత్యంలో సామాజిక స్పృహగా గుర్తించడమవుతుంది" ఒకడు చెప్పినా

చెప్పకపోయినా ప్రజలభాషలో, అసందిగ్ధంగా అందరికీ అర్థమయ్యేలాగా రాయటానికీ రచయితలకు అభ్యంతరం ఏమిటి ? ప్రజల భాషలో రాస్తే సృజనాత్మకత ఎందుకు ఖూనీ అవుతుంది ? జానపద కవిత్వం కవిత్వంకాదా? పల్నాటి వీర కథ, కాటమరాజుకథ, బొబ్బిలికథా కవిత్వంకాదా ? ప్రజలభాష కాకుండా నీకు ఒక సొంతభాషవుందా ? సృజనాత్మకతకీ, వ్యంగ్యానికీ ప్రజల భాషకీ అసందిగ్ధతకీ వైరుధ్యం ఎందుకు వచ్చింది? సందిగ్ధంగా రాయటం వ్యంగ్యమా ? రాసినవాడికి తప్ప మరొకడికి అర్థం కాకుండా రాయటం వ్యంగ్యమా ? రచయిత అనుభూతి హృదయంనుంచీ వస్తుందంటే హృదయం అంటే అర్థం ఏమిటి ? నరాలకిభిన్నంగా వున్న ఆ హృదయం ఎక్కడ కనిపెట్టారు ? "చారిత్రక బంధనాలనుంచీ మనిషికి విముక్తి కలిగించే" స్పృహ వ్యక్తి స్పృహ అవుతుంది కానీ సామాజికస్పృహ ఎలా అవుతుంది. సామాజిక విముక్తిని కలిగించే స్పృహతో మనిషికి విముక్తిని కలిగించగలం కానీ మనిషిని విముక్తి చేయటం ఏమిటి ? వ్యక్తి స్పృహకీసామాజిక స్పృహకీ తేడా తెలియకుండా వామపక్ష కవుల్ని తొత్తులుగా చిత్రించటం సమంజసమేనా ? వ్యంగ్యానికీ అభివ్యక్తికీ కొత్త అర్థం చెప్పకోకపోతే సంప్రదాయిక అర్థంలోనే గ్రహించాల్సి వుంటుంది. అప్పుడు సుదర్శనం చెప్పే వ్యక్తిస్పృహ కూడా ఆధ్యాత్మికస్పృహ అవుతుంది. అస్తిత్వవాదాన్ని మార్క్సిస్టు కోణం నుంచీ చెప్తున్నట్టు భ్రమింప చేయటం దేనికి? అక్కడికి సుదర్శనం స్వేచ్ఛను కోరే మేధావి, మార్క్సిస్టు రచయితలు స్వేచ్ఛను కావాలని రాజకీయ పార్టీలకి బలిపెట్టుకుంటారన్నమాట మనకు తెలిసిన విషయాలకు మనకు ఇంకాతెలియని విషయం హద్దుగా వుంటుంది. అసలే తెలుసుకోవటానికి సాధ్యంకాని విషయాన్ని హద్దుగా భావించటం శాస్త్రీయంకాదు.

భౌతిక ప్రపంచం మాత్రమే అస్తిత్వంలోవున్న ప్రపంచం. దీనికి భిన్నంగా స్వతంత్రంగా ఆధ్యాత్మిక ప్రపంచం అనేదిలేదు. పదార్థ భిన్నమైన పదార్థం నుంచీ వేరు చేయబడిన మనస్సు కానీ ఆత్మకానీ వుండవు. ఉన్నది ఒక ప్రపంచమే. అది భౌతిక ప్రపంచం మాత్రమే. ఈ ప్రపంచ అయిక్యత దాని భౌతికతలోనే వుంది. స్థలకాలచలనాలు సకల జీవితానికి మౌలిక రూపాలు. పదార్థాన్ని స్థలకాలచలనాల నుంచి వేరుచేసి పరిశీలించరాదు. పదార్థ పరిణామ ఫలితం మెదడు. మెదడు వ్యాపారం మనస్సు. మనస్సుపదార్థ మూలం. ప్రపంచంతోఅన్యోన్య క్రియనుంచీ చైతన్యం పుడుతుంది. చైతన్యం భౌతికఇతరం. పదార్థ క్రమం అనివార్యం. వాటికి సంబంధించిన మన భావాల్తో నిమిత్తం లేకుండా భౌతిక వస్తువులుంటాయి. కవిత్వం చైతన్య రూపం. సామాజిక జీవితం శ్రమనుంచీ భాషనుంచీ ఏర్పడుతుంది. శ్రమసాధనాలూ, భాష లేకుండా సమాజం వుండదు. సామాజిక జీవితానికి ఆర్థిక వ్యవస్థ పునాది. చైతన్యానికి ప్రధాన కారణం ఆర్థిక వ్యవస్థ. ఏకైక కారణం కాదు. మతం, తత్త్వం, రాజకీయాలూ, నీతి, కవిత్వం అన్నీ చైతన్య

రూపాలే. దేన్నీ సార్వకాలిక, సార్వజనీనంగా భావించి విశ్లేషించ కూడదు. నిర్దిష్ట కాలంలోని నిర్దిష్ట సమాజంలోని కవిత్వాన్ని నిర్దిష్టంగానే పరిశీలించాలి. సామాజిక, సాంస్కృతిక వ్యవస్థల్ని అధ్యయనం చేయటానికి, పరిష్కరించటానికి విజ్ఞాన శాస్త్ర ఆవిష్కరణల్ని వుపయోగించుకోవాలి. చరిత్ర క్రమంలో కవిత్వాన్ని భాగంగా పరిశీలించాలి. పరిశీలిస్తున్న దశలోని ఆర్థికరూపం మానవ సంబంధాలూ కవిత్వానికి ఎంత వరకు పునాదిగా వున్నవో నిశితంగా నిర్ణయించాలి. ముందే నిర్ణయించుకున్న అభిప్రాయాలతో ముగింపులకూ నిర్ధారణలకీ రాకూడదు. ఆర్థికవ్యవస్థ కాకుండా తత్త్వం, రాజకీయాల వంటి వుపరితల అంశాలు నిర్దిష్ట కవిత్వానికి చోదక శక్తులుగా వుంటే వాటినే పరిశీలించాలి. కవిత్వంలోవచ్చిన మార్పులని కవిత్వం నుంచే కాక భౌతిక పరిస్థితుల నుంచీ వివరించాలి. కవిత్వంలో నిర్ణాయక శక్తి వస్తువేఅయినా శిల్పం లేదా రూపం లేకుండా కవిత్వం వుండదు. శిల్పం లేకుండా రూపం (Form) లేకుండా కవిత్వం వుండదనే విషయంలో సాహిత్యవిమర్శన లో భిన్నాభిప్రాయాలు లేవు. శిల్పమే ముఖ్యం వస్తువు అముఖ్యం అనే శిల్పవాదం అశాస్త్రీయం. తన వస్తువుకు రూపంగా లేనప్పుడు రూపానికి ఏమీ విలువ వుండదు. "Form has no value if it is not the form of its content" (Marx) వస్తు శిల్పాలకీ మధ్య కవిత్వం ఇతర వుపరితల అంశాలకీ మధ్య గతితార్కిక సంబంధం వుంటుంది. వుపరితలానికీ పునాదికీ మధ్య గతితార్కిక సంబంధం వుంటుంది. గతితార్కికుడు పరస్పర సంబంధాల్ని పరిశోధించమని చెప్పేవాడు కాదు. సంబంధాల్ని పరిశోధించేవాడు. ఫలవంతమైన శాస్త్రీయ దృక్పథం అనివార్యంగా గతితార్కికంగా వుంటుంది.

**"The scientists who have learnt to think dialectically still few, and hence the conflict between the discoveries made and the old traditional mode of thought is the explanation of the boundless Confusion which now reigns in the vertical natural science and reduces both teachers and students, writers and readers to despair". (Engels.)**

విజ్ఞాన శాస్త్ర పరిస్థితి ఇలావుంటే కవిత్వాన్ని శాస్త్రీయంగా అవగాహన చేసుకోవటంలో ఇంకా ఎక్కువగా గందరగోళం ఇప్పటికీ ఉండటం సహజం, కవిత్వ విమర్శను గతితార్కిక పద్ధతిలో చేయటం ఇప్పటికీ గతి తర్కాన్ని ఆమోదించిన వాళ్ళు కూడా సక్రమంగా చేయలేక పోతున్నారు. కవిత్వంలోని వస్తువులో మూఢ విశ్వాసాలను నిరాకరించటం కంటే శిల్ప సంబంధమైన మూఢ విశ్వాసాల్ని వదిలించుకోవటం అవసరం. కవిత్వ సృజన, విభిన్న యుగాల్లో విభిన్న ప్రక్రియలు ఏర్పడటం, కవిత్వంలో స్థలకాల చలనాలూ ఇంకా అశాస్త్రీయమైన గతానుగతిక పద్ధతిలోనే వివరించటం జరుగుతోంది. కవిత్వ సృజనకు కవి మెదడు, కవిచుట్టూ వుండే సామాజిక జీవితం ప్రధాన కారణాలు. "**Minds are always connected**

by invisible threads with the body of the people" (Marx) ప్రజలతో ప్రత్యక్షంగానో పరోక్షంగానో సంబంధం లేకుండా కవులు కవిత్వాన్ని సృజించలేరు. కవిత్వ నిర్మాతలు కవులే అయినా కవిత్వ పునాది ప్రజాజీవితం. మెదడు, మనస్సుల స్వరూపం మీద విజ్ఞాన శాస్త్ర ఆవిష్కారణలను కవిత్వ విమర్శ వుపయోగించు కోవాలి. నాడీమండలం పనిచేసేతీరు, మనిషి శరీర నిర్మాణం తెలియక పోవటం వల్ల కవిత్వ సృజనకు సంబంధించిన తప్పుడు అభిప్రాయాలు అనేకం ప్రచారంలో వున్నాయి. జీవితానికీ మనిషి మెదడుకీ ఆవేశ అన్యోన్య క్రియ కవిత్వ సృజనకు మూలం. మెదడులో ఆవేశం, ఆలోచన విడివిడిగా వుండవు. స్థలం కాలం లేకుండా మెదడులో భావాలు వుంటాయి. అందుకనే కవిత్వంలో కూడా స్థలభావననూ, కాలభావననూ ధిక్కరించే భావరూపాలు వుంటాయి. మనస్సులో ఏకత్వ భిన్నత్వాల ఐక్యత వుంటుంది. మెదడును గురించిన అభిప్రాయాల వెనక వర్గ పోరాట ప్రభావం వుంది.

జ్ఞానానికీ, ఆవేశపూరిత జ్ఞానానికీ కూడా ఆచరణ మూలం. ఆచరణ నుంచి మనం పొందిన జ్ఞానాన్ని ఆచరణలోనే పరీక్షకు పెట్టవలసివుంటుంది. కవిత్వంలో వస్తుశిల్ప సంబంధవిషయాలన్నీ ఆచరణలో అన్వయించినప్పుడే శాస్త్రీయ విమర్శ సాధ్యమవుతుంది. "...... **all the training for less of the actions of any individual person must pass through his brain, and transform them success into motives of his will in order to set him into action" —Engels.**

కవిలో బాహ్యప్రపంచం ప్రతిబింబించినప్పుడు అతని మెదడులో అంతకు పూర్వం వున్న అభిప్రాయాలతో, ఆవేశాలతో సమ్మేళనం పొందుతుంది. ఆసమ్మేళనం నుంచీ కవి సృజనక్రమం జరుగుతుంది. పాఠకుల మెదడును అధికారంలోకి తీసుకోగలిగినప్పుడు కవిత్వం ఆచరణలోకి ప్రేరేపింప గలుగుతుంది. యుగ విముక్తిభావాల్తో ప్రేరణ పొందిన కవి ప్రజల్లో అన్యోన్యసంసర్గాన్ని సాధించ గలుగుతాడు. కవిత్వాన్ని శాస్త్రీయంగా పరిశీలించాలంటే కవిత్వ పుట్టుకా, కవిత్వంలో వచ్చే మార్పులూ, కవిత్వం నిర్వహించే ప్రయోజనం మీద శాస్త్రీయమైన అవగాహన వుండాలి. నిర్దిష్టంగా కవిత్వాన్ని నిర్దిష్ట విశ్లేషించలేని విమర్శనా పద్ధతి నిరుపయోగం. విమర్శ అంటే కవిత్వంలోని వాస్తవజీవితాన్ని విశ్లేషించటం. కవిత్వాన్ని ప్రజల దగ్గరకూ ప్రజల్ని కవిత్వం దగ్గరకూ తీసుకుపోవటం. విమర్శప్రయోజనం విప్లవం. అంటే విమర్శ భౌతికమైన కార్యాచరణలో భాగంగావుండాలి. విమర్శ ఆయుధమే. కానీ అది ఆయుధ స్థానాన్ని పొందలేదు.

గతానుగతికత్వం యథాస్థితివాదానికి పునాది. సత్యాన్వేషణకి సామాజిక విజ్ఞానశాస్త్ర సత్యాలు ఆచరణ మూలం కానప్పుడు కవిత్వాన్ని విశ్లేషించి వివరించటం సాధ్యంకాదు.

(కడపజిల్లా రచయితల సంఘ సమావేశంలో ప్రసంగ వ్యాసం మార్చ్ '79)

సాహిత్య లేఖ :

# భారతదేశ నైతిక విచారణ

దేశం యావత్తూ భగల్పూర్ నేత్ర హింసలపై తన భయాన్ని, అసహ్యాన్ని ప్రకటిస్తూ వున్నది. కాని, ఇంతకన్నా నికృష్టమైన బ్రిటిష్ పరిపాలనా కాలంలో కూడా ప్రజల్ని చంపడానికి దేశంలో పోలీసులకు అధికారాలు లేవనే విషయం మాత్రం మరచే పోయాం. భారతదేశం స్వతంత్ర దేశం అయిన తర్వాత మొట్ట మొదటి సారిగా తెలంగాణా ఉద్యమ కాలంలో మాత్రమే వాళ్ళకు యీ అధికారాలు వచ్చాయి. జవహర్లాల్ నెహ్రూకు డిప్యూటీగావున్న సర్దార్ పటేల్ పోలీసులకు యీ అధికారాన్ని యిచ్చాడు. వీటికి నెహ్రూ అంగీకారం కూడా వున్నట్టు 'న్యూ స్టేట్స్ మన్'లో తన రచనల ద్వారా కింగ్స్లీ మార్టిన్ వెలుగులోకి తెచ్చాడు.

తమకు అనుకూలం గాని వ్యక్తులను "చట్ట బద్ధ హత్యలు" పేరుతో నిర్మూలించడంలో ఇవి మరో దశకి చేరుకున్నాయి. సర్దార్ ప్రతాప్ సింగ్ కైరాన్ లాంటి వ్యక్తులు యిందుకు దోహదం చేసినవారు. నెహ్రూ తనవున కృష్ణమీనన్ యీ చర్యలు ప్రోత్సహించాల్సిన అంశాలని ప్రోద్బలం చేసినట్లు కైరాన్‌పై తను జరిపిన ఒక విచారణలో బయట పడినట్టు ఎమ్.సి. సెతల్వాడ్ తన పుస్తకంలో పేర్కొన్నాడు.

'ఎన్ కౌంటర్ల' పేర ఎప్పుడైతే పోలీసులు 'నక్సలైట్ల'ను నిర్మూలించడం ప్రారంభించారో అది మూడవ దశకి చేరుకున్నది. గత ఒక సంవత్సరం నుండీ మాత్రమే "సంఘర్షణ"లనేవి పూర్తిగా హత్యలు మాత్రమేనని వార్తాపత్రికలు నోళ్ళు తెరవడం మొదలయింది.

అత్యవసర పరిస్థితి ఆ తర్వాత దశ. జనతా పాలనలో పేదరికం ఒక నేరంగా పరిగణించబడడం, బీహార్, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాల్లో పైశాచికత్వం రెచ్చిపోవడంతో ఇది చివరి దశకు చేరుకున్నది. భాగల్పూర్ నేత్ర హింసలకు కర్పూరి ఠాకూర్ 'కాల్‌దూత్' చర్యలు ముందుగా సూచనలు మాత్రమే.

ఆవులకు, బ్రాహ్మణులకు ఓ ఎత్తైన పీఠంవేస్తూ సతీసహగమనాన్ని, కుల వ్యవస్థను, హరిజనులపై జరుగుతున్న దమనకాండను ఆదరించే భారతదేశ నైతిక విచారణ కఠినత్వాన్ని పెంచడానికి ఉపయోగించే పాశవికత్వం మాత్రమే.

కాని - యీ వాస్తవాన్ని మనం ఒప్పుకోవడానికి అంగీకరించం. ఎందుకంటే ఇది మన నాయకులను అగౌరవ పరచేదీ, మన అహాన్ని దెబ్బతీసేదీ, ఎవరో మోపుతున్న ఫిర్యాదులా మాత్రమే కనిపించేదీ గనుక.

జనవరి 1

—వి. సుభద్రారావు
కటక్.

(ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ 17 జనవరి 1981 సౌజన్యంతో)

## సృజన జీవిత సభ్యులుగా చేరండి- చేర్పించండి

ఇవ్వాటి గురించి ఆలోచిద్దాం—

ఇరవయ్యొకటవ శతాబ్దం గురించి కూడా ఇప్పటి నుంచే ఆలోచిద్దాం

ఇవ్వాళ సృజనను నిలబెట్టుకుందాం— ఇరవయ్యొకటవ శతాబ్దం సృజనకు ఇప్పుడే ఇంధనం ఏర్పాటు చేద్దాం.

అరవై ఆరు నుంచి త్రైమాసికగా, ఒక దశాబ్దంగా మాస పత్రికగా ఎమర్జెన్సీ చీకటిరోజుల్లో తప్ప ఎన్నడూ ఆగిపోకుండా వెలువడుతున్న ఒకే ఒక్క ఆధునిక సాహిత్య వేదిక సృజన.

మీరు సృజనకు చందాదారులుగా చేరారు, చేర్పించారు—
విరాళాలు ఇచ్చారు. మీరు వీలయినంతగా తోడ్పడ్డారు.

నూరు పూలు వెయ్యి కాయలుగా సృజన
నూతన సమాజ పరిమళాలు, ఫలాలు పంచడానికి

## సృజన జీవిత సభ్యులుగా చేరండి.

**జీవిత సభ్యత్వం 200 రూపాయలు**

ఒకేసారి గానీ, నాలుగు సమాన వాయిదాల్లో ఒక సంవత్సరం లోపున గానీ చెల్లించవచ్చును.

శాశ్వతంగా సృజన మాత్రమే కాదు

మీరు సృజన ప్రచురణలపై 25% కమీషన్ కూడా పొందుతారు

సృజన జీవిత సభ్యులుగా ఈ రోజే చేరండి, చేర్పించండి.

ప్రజా జీవిత ప్రతిస్పందన సృజన
పది కాలాలపాటు చేయూత నివ్వండి

**SRJANA**, Telugu Monthly Feb/Mar '81 H/WL-10

Regd. No. with Registrar of Newspapers 10953/67.

## మీరు రక్షించుకోకపోతే

# రెండు మూడు నెలల్లో సృజన ఆగిపోతుంది .........

అవును, రెండు మూడు నెలల్లో సృజన ఆగిపోవలసిన పరిస్థితి వస్తోంది. ప్రస్తుతం సృజన పదివేల రూపాయల అప్పులో ఉంది.

బకాయిలు చెల్లించని ఏజెంట్లూ, చందాలు సక్రమంగా చెల్లించని అభిమానులూ, పెరుగుతున్న పేపర్ ధరలూ, ప్రింటింగ్ ఛార్జీలూ ఇందుకు కారణం.

డబ్బు బకాయివున్న ఏజెంట్లకు సృజన పంపకుండా వుండాలని కాపీలు తగ్గించినా అప్పు పెరుగుతూనే వుంది. ఒక్కొక్క సంచికకు దాదాపు రు. 2000–00 ఖర్చవుతున్నది. దాదాపు 100 కాపీలు జైళ్ళలో వున్న కామ్రేడ్స్‌కు, ఏ పారితోషికమూ లేకుండా సృజనకు రచనలు చేస్తున్న రచయితలకు, ఇతర మిత్రులకు ఉచితంగా పంపవలసి వుంటుంది. మిగిలిన కాపీల్లో దాదాపు 400 చందాలు. ఈ 400 కాపీల్లోనూ సరిగా డబ్బు చెల్లించినవీ, సృజనవద్ద నికరంగా డబ్బు ఉన్నవీ చాలా తక్కువ.

దాదాపు రు. 2000–00ల ఖర్చుకు బదులుగా ప్రతినెలా దాదాపు రు. 600–00 వసూలవుతున్నాయి. రు. 1000–00 చందాల బాపతు డబ్బు, పుస్తకాలమ్మిన డబ్బు కలిసినా ప్రతినెలా రు. 400–00 లోటు వస్తున్నది.

ఇక ఈ పత్రికను రక్షించుకోవలసింది మీరే–

* ప్రతి జిల్లాలోనూ కనీసం 100 చందాలు చేర్పించండి.
* ప్రతి చిన్న పట్టణంలోనూ సృజనకు ఏజెన్సీ ఏర్పాటు చేయించండి.

**సృజన మీ పత్రిక సృజన ప్రజల పత్రిక**

**సృజనను రక్షించుకోండి——**